శ్రీ

# సతీసక్కుబాయి

రచయిత:


కొచ్చర్లకోట కామేశ్వరరావుగారు





పబ్లిషరు:

[illegible]

శ్రీసత్యనారాయణాబుక్కుడిపో,

[illegible]

---

రాజమహేంద్రవరము

శ్రీరామాప్రెస్‌నందు ముద్రితము,

1931.





వెల 1-0-0

# నివేదన

కథలు కల్పనఁజేయవచ్చు—ప్రకృతి రామణీయకము వేధంగుల మధురముగ వర్ణింపవచ్చుఁ గాని ప్రదర్శన యోగ్యంబులగు రూపకంబులు రచించి పాఠకప్రేక్షకసుహృదుల నలరించుట కొంత కష్టము. నాటక రచనయందు శైలి సులభగ్రాహ్యముగను, తత్తత్పాత్రోచిత సంభాషణా వైఖరులను సక్రమవిధంబున బోషించునట్టిదియునై రుచులీనుచుండవలెను. కొలఁది పాత్రలతో దిదృక్షుల నానందతరంగముల నూయెల లూగించు రూపకములు—అందునను సాంఘికదౌర్బల్యమును నిరసించునట్టి రూపకములు—ప్రదర్శన యోగ్యములుగ నెన్నియున్నను నేఁడధోగతిఁబడుచున్న మన యాంధ్రావని మఱికొన్నింటి కెదురుచూచుచునే యున్నది. ఉత్సాహవంతులగు కవులిట్టి నాటకములకొఱకే తమ లేఖినినిఁ బోనిచ్చినచో నాయాశయము వృథగాదు.

ఈ రచయితకిది ప్రథమ యత్నము అయినప్పటికి భక్తమందారులగు శివయోగి సక్కుబాయిపాత్రలనుభవయోగ్యమగు భక్తిరసమునఁ దల మున్కలుగ మునిచి యెత్తఁబడినవి. ఆ పాత్రములఁ జదువునపుడు హృదయము సహస్రభంగుల గంతులువైచుచు శ్రీమన్నారాయణ చరణసరోజ సేవనాశించుననుట యతిశయోక్తి కాదు.

ఆంధ్రగీర్వాణ సాహితీ
సమాజము. మదరాసు.
౧—౬—౩౧

ఇట్లు
రసజ్ఞకవిజనాశ్రయుఁడు
జె. వి. రాధాకృష్ణయ్య.

# స్మృతి

పతిభక్తిపరాయణయై—సుశీలయై మన్ననల నం దినట్టియు, నవమాసంబులు నను గర్భమున న్బెంచి, కని, నవవర్ష ప్రాయంబు దనుక నతిగారాబంబున బుద్ధులఁగఱపి ఏ బదవయేట దివ్యసీమ నలంకరించిన నిజమాతకును— తన్మాతృపూత హస్తాంజలినుండి తమ పున్నామనరక వి ముక్తికై సహృదయముతో నన్బెంపుగైకొన్న దయామ యి—సాధుశీల నాదత్తత తల్లికిని (స్వర్గీయ) నాఋణముఁ దీర్ప వారల పవిత్రపదతలంబులఁ దలఁచి తొలిపువ్వు ముగా నొసఁగి కృతార్థుఁడ నగుదును.

ర చ యి త.



# రాధాకృష్ణ.

(గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.)

ఇదియొక చక్కని భక్తిరసప్రధానమైన నాటకము. శ్రీకృష్ణు నియందుగల యపారమైనభక్తి నిగూఢనిశ్చలమైనభక్తి రాధ యెన్నిరీతుల నేవిధముగ బ్రదర్శించినదో యిందుగాంచనగును. రాధకును శ్రీకృష్ణునకునుగలప్రేమ జీవాత్మకును పరమాత్మకును గల యాధ్యాత్మిక సంబంధమువంటిది గాదని యీనాటకరాజము బోధించును. ప్రకృతి సుకుమారిణియై మహాసుందరియైన రాధ—సంతత శ్రీకృష్ణసంకీర్తనామృతధారులనే యాహారపానీయములుగ గోరిలిన రాధ—సర్వకాల సర్వావస్థలయందు లోకనాదు నిరంతరాయదర్శన నిత్యమహానందపరవశయైన రాధ—మృదుమధురమకరందపరిపూర్ణ వికసిత పుష్పలతుల యందు—నిర్మల జలపూర్ణ వాహినీతరంగములయందు—గిరినిర్ఝరములయందు—పర్వత మాలికలయందు—శ్యామలకోమల తరులతాగ్రములయందు—దిగంతముల యందు—నందు—నిందు—ననేల ? ప్రకృతియందంతటను శ్రీకృష్ణుని మనోహరదివ్యరూపమును గాంచిన రాధ—తనయంత సుందరస్వరూపిణియగు కాంత యీభూలోకమున నెందును లేదని గర్వపడుచుండెడి సత్యభామను, కాలకూటానలప్రతిమానవిషజ్వాలాభూయిష్ఠమగు కాళీయనాగేంద్రుని ఫణాగ్రమున దాండవమాడిన, నటశిఖామణిని తనచీరచెఱగుకొంగున ముడివేసికొని లోబరచుకొంటినని విఱ్ఱవీగు సత్యభామను యేరీతిగ గర్వోపశాంతిజేసి, భక్తురాలుగ జేసినదో యీనాటకరాజమున, ముద్దులొలుకు చక్కని పదములచే వర్ణింపబడినది. సత్యభామ అసూయాజనితగర్వరూపకములైన పలుకులు, చేష్టలు—శ్రీకృష్ణుని నిజస్వరూపము—శారదుని నిరంతర హాస్యప్రసంగములు చదివితీరవలయును. యీనాటక మాంధ్రదేశమున పేరొందిన నాటకసంఘములచే ననేకపట్టణముల ననేకపర్యాయములు ప్రదర్శింపబడియెను. వెల 0—12—0

---

# ఇందు వచ్చు పాత్రలు

## పురుషులు.

శ్రీకృష్ణుఁడు—ద్వారకాపురీశుఁడు.

విశ్వేశ్వరభట్టరు—సక్కుబాయి భర్త. కథానాయకుఁడు.

శివనాథయోగి—సక్కుబాయికి భక్తినుపదేశించిన యోగి.

మోహనరావు
శర్మ
సుందరం
వేంకటేశ్వర్లు
} సంఘసంస్కర్తలు.

నరసింహారావు—(తాలూకాబోర్డు ప్రెసిడెంటు, ప్లీడరు. సుందరమ్మ భర్త.)

కనకయ్య—బడి పంతులు.

## స్త్రీలు.

సక్కుబాయి—కథానాయిక. (భక్తురాలు)

అత్తగారు—విశ్వేశ్వరభట్టరు తల్లి.

సుందరమ్మ
మాణిక్యం
నరసమ్మ
జానకమ్మ
వితంతువు
} భారత మహిళాసభ సభ్యురాండ్రు.

రుక్మిణి—శ్రీకృష్ణుని భార్య.

నోటు:—ఈనాటకము ప్రదర్శింపఁ దలఁచువారు ప్రకాశకుల అనుమతి గైకొనవలయును.



శుభమస్తు.

# సతీసక్కుబాయి

## ప్రథమాంకము.

(సక్కు-గా[illegible] [illegible] [illegible])

ఉ. [illegible]

[illegible] [illegible]భా

చ్ఛాయల [illegible] [illegible]నీ

తీయుని పాటచేఁ [illegible] [illegible] సోలగా.

సక్కు—ప్రభూ! శ్రీకృష్ణ పరమాత్మా! ఎంతటి నక్కఱివయ్యా! నీచర్యలు తలఁచుకొన్న కొలఁది నా [illegible] పరవశతఁబొందుచున్నది. ఒకపరి యజ్ఞ[illegible], చిదానందస్వరూపుఁడవై చెలంగు డింభకమూర్తివై యశోదచెంత నల్లరులు సేయుచు, బుడి బుడి యేడ్పుల నా మాతృదేవి పవిత్ర హృదయమును అమృతమయముగఁ జేసి—జాలిచేఁ గరఁగించి—నీబాహ్యరూపముచే నీదివ్యావతారమును గప్పిపుచ్చి భ్రమింపఁజేసియు, మఱియొక్కతఱి నందఱికన్ని రూపములఁ గన్పించి—సంసారవిముఖుల గావించి—చ్యుతపరిచ్ఛదల నొనరించి—మాయాప్రపంచ జాలమునుండి

నెట్టి యుపాధినొసంగి—ఎట్టి గేయములం బాడి—ఏ స్తవరాజములబఠించి నావశమొనర్చుకొందును? సర్వకాల సర్వావస్థలయందును నిన్నిప్రతిమా ప్రతిష్ఠనొనర్చుకొని భజించుటదక్క— నేనేమి చేయగలను? నేభుజింపం దలంచునవన్నియు నీకేముందు నివేదనములు! చూడు! నాయనా! దివ్యాపగా సన్నిభములైన యీ గౌతమీతోయములం దప్పి దీర్చుకొనుము! నాయనమ్మ నాకొసంగిన బువ్వకోపయుక్తమైనను చిర్నగవులతో నారగింతువుకదా! నాయందెంత దయగలవు నీవు! ఏక్షణమునందైన నజ్ఞానురాలగు అత్తగారు నిన్ను నాసన్నిధినుండి వేఱుపఱచిన నాహృదయమెన్ని భంగులఁ గలఁగుచుండుననునోకదా! ఇందువల్లనే కాబోలు రాధారుక్మిణ్యాది పుణ్యసతులు నీవియోగమున కోర్వజాలక బలవన్మరణ మపేక్షించిరి! ఆహా! ఎంతమోయారము! నాయనా! ఇంటింట ద్విత్రిగతిం! బెనవైచి కెంబెదవుల మురళినాని శ్రావ్యమగు మోహనరాగముల నాలపించుచు శాంతమయమగు దృక్కులచే నెల్లజగంబులం గాపాడు నఖండ తేజోమయుండవగు నీవు నాప్రార్థనలాలించుచు నబలయగు నన్నుం జూచి—నెట్టిమొట్టి పల్కులచే జగన్నాథుండవగు నిన్నుం జేర నపేక్షించు నన్ను జూచి హసించుచున్నావా! సరిలే! నేకోరునదికూడ నట్టిదయే! నీలేనగవులే—నీకృపావీక్షణములే—నీదివ్యావతార ప్రసంగములే కర్ణచక్షుపేయముగం దోంచుటయే వాంఛించుచున్నాను! కాదేని జగదండభాండములం గుక్షిలో నిముడ్చుకొని కాపాడు నీబ్రహ్మాండమూర్తి! నీదారుప్రతిమారూపమునఁగాంచి భ్రమించుటయే భ్రమగాదా!

అయ్యో! జలాశయమున కరిఁగి చాలతడవైనదని అత్త కోపించును! ఇంటికిం ద్వరితమె బోవలను. (బిందె తీసుకొనిపోవును.)

## అనుబంధము 1.

(అత్త తీవ్రగమనమున వచ్చుచుండును.)

అత్త—ఎంత మొండివి నాకు దాపరించితివే! నీరు తేబోయి ఎంత తడవైనది! మొగుడంటే భయం మొదలే లేదాయె! నామాటేనా లక్ష్యం ఉండొద్దూ! ఓమాటంటే కుక్కకేనా సిగ్గుంటుంది కాని నీకాబొమ్మతో ఆటలేమిటంటే సిగ్గులేదుకదా? ఝాము సేపై వెళ్లి యింతవరకూ అక్కడే ఏంచేస్తున్నావు? ఇంటిలో ఏంపనులుంటాయో—పాపం అత్తగారుముండ చేసుకోలేకుండా ఏడుస్తుందేమో—అనే చింతా నీకు ఉందా? వెధమబొమ్మతో ఆకబుర్లేమిటి? మాటామంతీ ఆడుకొంటూ మగనితోనో అత్తగారితోనో కాలక్షేపం చేయడానికి నోరురాదు కాని కొయ్యబొమ్మలతోటి రాతిప్రతిమలతోటి నవ్వులు సయ్యాటలునా?

సక్కు—అత్తగారూ! నీటిబిందె భారముగనుండుటచే గొంత తడవిచట విశ్రమించితిని. ఇదిగో వచ్చుచున్నాను! కోపింపకుడు.

అత్త—చేసిన పాడుపనికింకా సిగ్గుపడియుండక 'కోపపడకండి' అని నాకు బుద్ధిచెబుతున్నావా! బారెడు దూరంలోనున్న కోనేటినుండి లక్కపిడతంతబిందె సగం నీటితో తేవడానికే నీకింత బరువా? అట్లాగైతే నీపొగరణుస్తానుండు! ఇంట్లోనున్న పెద్ద గుండిగతో నీచేతనే నీరుమోయిస్తా. మొల్లోనున్న ఆబొమ్మ తీసిపారేస్తే అబిందెమోస్తావా యింకా దాని తాతబిందె మోస్తావా? ఎంతపొగరు?

సక్కు—అమ్మా! మోయలేనిభారము నాచే మోయించుటకు నేఁజేసిన యపరాధమేమియు లేదే! మీయాజ్ఞ శిరమునఁదాల్చి జలములఁదెచ్చుచుంటిని! కొంచెము కాలవిలంబమైనందులకు

మీ రట్లు కసరివైచుట న్యాయమా? ఆబొమ్మపై మీకింత యాగ్రహమేల? ఆబొమ్మ మీరు దాచినను దాగదు! అది పరమేశ్వరమూర్తి!

సీ. పదియాఱువేల గోపస్త్రీల కమృతంబుఁ
జూపించు చిత్స్వరూపి యతఁడు!
పరమ మునీశ్వర ప్రార్థన సిద్ధుఁడై
తనువుఁ గాంచిన జగన్మాన్యుఁడితఁడు!
భక్తలోకానికి భావాబ్ధులలో
మొలచిన బహురూప మూర్తి యితఁడు!
మానవలోకనీత్యాసిరనిధిలోన
శయనించు సతతప్రశాంతుఁడితఁడు!
అణువు మొదలుగ బ్రహ్మాండమంత గూడ
నిండి చరియించు శక్తి ప్రకాంతుఁడితఁడు!
వానిదాఁచుట కేవలాజ్ఞానమనుచు
తెలిసికోలేము మానవులము గాన!

జగన్నాథుని సర్వశక్తులు నందే యిమిడియున్నవి! లీలామానుష విగ్రహుండగు నాదేవదేవుని వ్యాపారమంతయు నీప్రతిమయందే కేంద్రీకృతమై నాహృదయపేటికయందు భక్తిరజ్జువులచే గ్రంథితమై భద్రపరుపఁబడియున్నది గావున తమరెంత యత్నించినను బాహ్యరూపమును నశింపఁజేయగలరుగాని ఆప్రతిమయందలి యాంతరంగికాకారమును మార్పజాలరు!

గీ. కేవలాశావికృతములు కిల్బిషప్ర
పూరితమ్ములు మనతలంపులు! పవిత్ర
దేవతాదర్శనముఁ జేయలేముగాన
మానవుల కీశిలాప్రతిమ మ్మొదిక్కు!

ఏదేని దోషమున్న నన్నే నిందింపవలయుగాని అన్నెముపున్నెమెఱుంగని యీమూర్తిని దూరనేల? ఏదో నాకుతీరిక లభించినప్పుడు నాజీవితాంధకారమునం దట్టిలిచ్చాన్పిన ఆదేవదేవుని చూపు పొడగాంచును! ఆపవిత్రసంఘటనముకూడ తామ నిందింప రానిదేగదా !

అత్త—ఆఁ! ఎంతెంతమాటలు నేర్చావే? పిట్టకొంచెమైనా కూఁతగొప్పదన్నట్టు పెద్దపెద్ద ధానాలు చెప్తున్నావేఁ! ఆబొమ్మ దాచినాదాఁగదుఁ? చూస్తా! దానిశక్తి! నీభక్తి! ఏదీ? ముండ పీనుగా ! (అని బొమ్మలాగుకొనుటకు కఠినముగా ప్రవర్తించును. సక్కుబాయి అమాయికముగానే ప్రవర్తించును.) అయిందా! ఈపాటు నీఅబ్బతో చెప్పుకో! యింకే బొమ్మతో పేలుకొంటావు! రాళ్ళు, దొంకలు పట్టుకేడవాలి! ఇంకా బుద్ధితెచ్చుకోకుండా నీలో నీవే కబుర్లుచెప్పుతూ కూర్చుంటే పిచ్చి ఆస్పత్రికి పంపిస్తా! అక్కడ ఆదొరలంతా నీరోగం చప్పగా కుదురుస్తారు !

సక్కు—అయ్యో! మీరదురభిప్రాయముగాని మృద్దారు ప్రతిమలందా లోకప్రభుని మూర్తిని మనము సృష్టించుచున్నాము! లేదని గర్హించుచో నాప్రతిమ బెగడొందునా! మీరాగ్రహించిన చో కంపించునా! ఒక్కమాట!

చ. కరమను రక్తిఁజంద్రికల గాటపు కౌఁగిలి చంద్రకాంతముల్
కరగెడువోలె భక్తజనకమ్రతర స్మరణార్ద్రగీతికా
చరణము లాలకించి వికచమ్మగు చిత్తముతోడ చెంతకుం
జరిగెడు నీశిలాప్రతిమ స్వాంతము ప్రాణమయంబు కాదొకో.

పవిత్రమగు దేవళములలో స్నిగ్ధశ్యామల శిలాప్రతిమలం దిట్టిదని నిరూపింపరాని దొక ప్రభమూర్తి భవించినదని విశ్వసించిమే

గాదా మనమచట కేల్పోస్తుము? కాదేని శిలావిగ్రహములోని హృదయము శైలకాఠిన్యమని నమ్మినచో నచటికి శుచులమై నిర్మలహృదయులమై- ఘనపుష్పాదులం గైకొనిపోనేల? ఈశ్వ స్మమీరు దయాంగపీఠ సింహాసనాభాసనాలమున దగ్గఱమునర్చి ననుదరించుటగా? నేను నారాధనయందేమి కొరత గలదా? భారతీయులకు నిరాకారధన, గ్రహారాధనలు నూత్నసాంకేతములుగావు! మీరు పెద్దలు—నేనిట్లు పలుకుట తమకాగ్రహ కారణము గాన క్షమించుడు. భక్తజన సులభుడగు పాండురంగని సురుచిరమూర్తిని నాహృదయ ఫలకమున స్థిరముగ ముద్రించుకొంటిని. అది మీరెన్ని తెఱంగుల యత్నించినను పర్యాదస్తము కాజాలదు! నేనా మంగళాకారుని భజన మఱువజాలను! నేను పిచ్చిదాననని మీరు పిచ్చిపడుచున్నారు! నాయాలోచ్యము మన్నించుడు! చిన్నదాననుగదా! ఈమాత్రమునకే కినిసి మీరిట్లు చాలదవ్వు పరిభాషించుచున్నారు.

అత్త—సరిపో! నను! ఇంటికి కొత్తక విశ్వాసంతో చెప్పి నీవేదాంతం మానేస్తే! నలుగురు నీమొగాన్ని ఉమ్మేస్తారని ఊరుకొన్నాముగాని యింతకన్నా నోరు పెరిగితే నీకబుర్లు అణిగిపోతాయి! యీ తనేపు ఎక్కడేం ప్తన్నావని అడిగితే ఎంతగొడవచేశావు! ఎగ పెడకబుర్లు చెప్తావు!! పెద్దముండ ఏదో మనకోసమే చెప్పిందికదా అని బుద్ధి తెచ్చుకోకుండా నోటికి వచ్చినట్లల్లా కోల్తావా? ఇంతమొండికెత్తితే నీకు సంసారం ఏంవంటపడుతుంది? నాకున్నూ ఆ భక్తి ఉందికాని యిల్లాంటి దొంగభక్తిగాదు! నలుగురు చూస్తుండగా పెళపెళ్ళాడేటట్టా లేసిన మల్లురేకు కట్టుకొని, పెద్దపేటవేసుకొని, తెల్లని భూతి బొట్లు నొట్టనబెట్టుకొని, రుద్రాక్షమాల వక్షాంతరమున

తెక్కుస్తూ, ఏమూలనుంచి కుక్క పిల్లి వచ్చి అంటుకొని పోతా యోఅని భయంతో అప్పుడప్పుడుచూస్తు, ప్రాణం ఆకలితో కొట్టుకొంటూన్నా, స్థైర్యంచిక్కబట్టిమూడునిముషాలు మూల కూర్చొని చేసే జపానికంటె నీచాటుమాటు కల్లబొల్లికబుర్లు దేవుణ్ణి సంతోషపరుస్తాయా! అదీగాక శుభ్రంగా తలదువ్వు కొని వాసననూనె పుస్తుకొని, గర్భాదానంనాటి గళ్లచీర గాగరాలాగకట్టుకొని, దానినిండా సెంటునూనె దిమ్మరించుకొని కొత్తరకంగా కత్తిరించిన రవికతో. పట్నం చామంతిపూలు పట్టినన్ని జడ[illegible] [illegible] నూనెలు గుచ్చి వనకా[illegible] [illegible]నవన్నీ పట్టుకొని [illegible] మళ్లీ దూగ[illegible] [illegible] పెట్టాకి [illegible] ప్రియా[illegible] [illegible] నాకూ తెల్సును కొంచెం సం[illegible] ! రక్తి [illegible] దే భక్తి కుదరదు—భక్తి లేకుంటే ముక్తి దొరకదని! కృష్ణా! బొబ్బతాగుతావా అంటావా? రామా! నాటకం ఆడవాలంటావా, గోవిందా గోచీపెట్టనా అని అడుగుతావా! మాధవా! మాట్లాడవా అంటావా! నీస్వకొంచెంచేసినో—తినక ఆంబొమ్మ మూతికి పట్టి స్తావా! ఎంతతమాషాగాయుంది అల్లరి! నీ ఒరసచూస్తే ప్రపంచం యేమనుకొన్నా నేనుమాత్రం భరించలేకుండా యున్నాను! అబ్బే!!

సక్కు—అత్తగారూ! ఎంత అవివేకమండీ! మీయాజ్ఞ కెదురుచెప్పు దునా? మానుమని ఆజ్ఞాపించినచో జగన్నాథునిగూర్చిన బాహ్యపూజార్చనలు మానుకొందునుగాని నారాయణ చరణారవింద మకరందపాన ప్రమత్తమగు నాచిత్తము వెదదారిని

## ద్వితీయ రంగము.

ప్రవేశము:—మోహనరావు—శర్మ—రంగరాజు—వెంకటేశ్వర్లు—నరసింహారావు.

మోహ—శర్మగారూ! ఏదో వాదిస్తారుగాని మీకుమాత్రం తెల్లిను దామిటీ! ఖ్రిస్తుగం లోకమంతా నిలువునా నీరయిపోవటానికి కారణం మీరెఱుగరూ? శాస్త్రం శాస్త్రం అనడంగాని అది వెనకటిరోజుల్లో ఎట్లాచలామణి అయిందో యీ రోజుల్లో ఎంతగౌరవంగా కాపాడబడుతోందో తమ రెఱుగరూ? ఇంతకీ నేనదేమిటంటే కాలాని కిట్టేటుగా శాస్త్రం కొంచెం Amend చేయిస్తే కాగూటూగదా! ఏమంటారా? పాపం! రామ రామా! నాలుగేళ్ల కుర్రిముండకి పెళ్లేమిటయ్యా? ఏతెల్లారఝామునో నిద్రకళ్లతో ఆగుంటని తల్లి ఒడిలో కూర్చోపెట్టి బాజాభజంత్రీ లమధ్య అయిందంటే అయిందనుకోడంగాని చేసేవాళ్లకి shame లేకపోతే చేయించే మీ వంటివారికి అయినా కొంచెం......ఉండొద్దూ?

శర్మ—అదా! మీవాదన! యేమిటో నన్నుచూచి మందహాసం చేస్తుంటే ఎందుకాయిట్లాగునొతోంది అనుకోని ఊరుకొంటున్నాను. పిల్లదాని వివాహం విషయంలో జరిగిన అక్రమ వ్యాపారాన్ని నిందిస్తూన్నారా? యీ నాటికి శాస్త్రం దూషించడానికి తమవంటి యోగ్యులు బయలు దేరారు! మన పూర్వులంతా మనంత నిర్భాగ్యులుకారు. గనుకనే శాస్త్రం ప్రకారం కార్యాగటాన్ని జరిగించుకొని నూరేండ్లు పార్వతీ పరమేశ్వరుల్లాగ జీవించారు. గంపెడేసి పిల్లలతో కలకలలాడుతూ కాపురాలు చేశారు! పాడి పంటాగలిగి కదు

పునాదాలిచ్చారు! పోనీ! తల్లితండ్రుల ఆజ్ఞలో ఉండే చిన్నదానికి అప్పట్లో ఆతంతు అర్థంగాకపోయినా తర్వాతైనా నాసుఖంచి పెద్దలపేరు స్మరించుకొంటూంది!

మోహన—ఔనౌను! బాగా సెలవిచ్చారు! ఆవిధంగా పెండ్లిచేయబడ్డ అమాయకులే గాదూ అసంఖ్యాక వితంతువులై గొల్లున గోల చేస్తూమీఅల దతిపేరు చెప్పుకొంటున్నారు.(వికటముగానవ్వును)

సుందర—(ప్రకాశముగా) అయ్యా! మీరిద్దరు యిట్లా చర్చించుకోవడము ధర్మముగాదు! ఈనోజున సాంఘుసంస్కార మహాజన సభలో సర్వవిషయములుచర్చింపబడును! ఇప్పటికే ఆలశ్యమైనది! ఈసభవారి అందఱితరఫున సాహసించి శ్రీ నరసింహారావుగారిని యీసభకు President గా ఆహ్వానిస్తూ విలువగల యీ హారతికర్పూరదండను మెళ్లో వేస్తున్నాను. మీ అందఱికి సమ్మతేఅని నమ్ముచున్నాను.

అందఱు—ఆ! ఆ! దాని ఖరీదు మాకు అంటకట్టకుండాఉంటేచాలు

(సుదరం కూర్చొనును. బల్లమీద కార్యక్రమము, చర్చనీయాంశములు వ్రాయబడిన కాగితము, Fountain Pen ఉంచబడును.)

నర—(మెల్లగా-నవ్వుచు) మిత్రులారా! ఏదోనన్నింతగా, కొండంతగా, గౌరవించి దండలు హారాలు యిచ్చేరుకానీ అంత మహోన్నత పదవికి నేను తగుదునా!

అందఱు—తప్పకుండా తగుదురు!

నరసిం—అదంతా తమదయావిశేషమే! నేటి సభలో బాల్యవివాహము, వితంతూద్వాహము—స్త్రీవిద్యావశ్యత చర్చింపబడవలెనని నిర్దేశింపబడినది. ఆయావిషయములు సమర్థులగు వక్తలచే నుపన్యసింపబడును.

(కూర్చునును—చప్పటలు మ్రోగును)

మీ—అగ్రాసనాధిపతీ! మిత్రులారా! నమస్కారములు ప్రతిక్షణము మనదృష్టిలో మనవినుకలిలో అనుభవించుచున్నట్టి విషయమునే మీస్మరణకుఁ దెచ్చెదను. శీతవర్షాతపానుభవముగాని—స్త్రీపురుషవిమర్శనా విజ్ఞానవేశముగాని—ఎట్టిలౌకిక విషయాభిప్రాయముగాని ఎఱుఁగని పసికూనలకు, శాస్త్రము మాట అటుంచుము, పెండ్లింప్లుచేయుట మిక్కిలి హేయకార్యమని నావాదము. నావాదన యెంతవఱకు సమంజసమైనదో బాలవితంతువులతో బాధపడు నా Friends అందఱికి అనుభవమే! పెండ్లియను మిషమీద బాలబాలికలకు ప్రణయబాంధవము చేకూర్చిన జననీజనకులెంత మూర్ఖులో గ్రహించండి! వరుఁడు మంగళనాదములమధ్య పౌరోహితాధారమున నిలువఁబడి అత్తయొడిలోనున్న అమాయికపు పాపకంఠమున సూత్రబంధమొనర్చుచున్నాడు! తానొనర్చునది ఏమో మొదులకో ఆబుడుతని కేమియు తెలుక లేదు! సుమూహూర్తమాసన్నమైన దదని కడుపడి నొడుదుడుకుఁ పడు బ్రహ్మయాసూత్రమును తానేయంచుకొని కన్యను గుర్తింపఁజాలక కన్యాతుల్యయగు మాతకంఠమున కుట్టివెట్టుచున్నాడు! (నిజము! నిజము అందఱు) అది తప్పక తల్లి కంఠమున కుట్టయే! పెండ్లి కాదు!! బాలిక అల్పకాలములోనే భర్తృవియోగినియై తల్లి యింటఁజేరి దుఃఖజీవియగుచున్నది! పెండ్లికార్యమువలన సుఖింపవలసినది తల్లిదండ్రులుగాదు! భార్యాభర్తలు! వీరికి పరస్పరము చిరస్థాయిగా నుండవలసినది ప్రేమ! ఆదివ్యపదార్థము ఒకరికొకరు ప్రసాదింపఁజాలరు! సహజముగ నొండొరుల ప్రేమ సమాగిముమున జనింపవలసినదే! అట్టిప్రేమ చిఱుత ప్రాయమున దుర్లభము! లోకానుభవముకలిగి—ఇది మంచి యిది చెడ్డ అను

విమర్శనానుభూతిలి — ప్రేమగంధ మెట్టిదను యూహా జనించినప్పుడే యువకులు ప్రేమించుట నెఱుంగుదురు ? అది యే వారికి వివాహయోగ్యమగు వయస్సు! వారేతమ ప్రేమ నిధులను గుర్తించుట కష్టాలు! పెండ్లి యెవరి యిష్టానుసారము వారు యుత్తమయ పరిపాకమున నొనర్చుకొనుటకు సంఘము సహస్రభంగుల తోడ్పడవలయును! కాదేని లోకము పవిత్రితమమగు—నిష్కల్మషమగు సుధాసన్నిభమగు పరిశోయపయోలభ్యమగు ప్రణయసుధను గుర్తింపఁజాలక గోల్పోయి శుష్కహృదయములతో— కపటక్రియతో జగన్నాటక రంగమున నటీనటులై కాలప్రవాహమునఁ గలియుచున్నారు! (అందఱు—ఔనౌను)

ఇప్పటికైనను మీరందఱు యీవిపరీత వైవాహిక విధానమును మాపుమాపి బాల్యవివాహ పిశాచమును సంఘసంస్కార ప్రేరణాభిమానులై యుక్తవయో వైవాహిక సుకృతాస్త్రప్రయోగమున శతసహస్రఖండములు చేయుదుమని వాక్కు వాగ్దత్తమొనర్చువఱకు నాకు శాంతిలేదు! ఏమందురు?

అందఱు—ఆహా! మీ అభిప్రాయము తప్పక మేమందఱము ఆచరణలోనికి తీసుకువత్తుము. మీరు ధైర్యముగా నుండవచ్చును!!

మో—సమస్కారము! ఇంతటితో—ఈపవిత్రోద్దేశ తేజోవేశము మీ హృదంతర సీమను ప్రకాశించుచుండునను నమ్మకముతో విరమించుచున్నాను!

వెంకటేశ్వర్లు—(నిలువఁబడి) అధ్యక్షా! స్నేహితులారా! సమస్కారములు! మనమిత్రుఁడు మోహనరావు బోధించిన విషయాన్ని బట్టి నేచెప్పేదికూడా పుట్టేఉంది! బాల్యవివాహమువల్ల బాలవితంతువులు ప్రపంచమంతా నిండియున్నారని నేనను! బాలు

నకు పెండ్లీడునచ్చి దృఢకాయుఁడై—జ్ఞానవంతుఁడైనప్పు డొనర్చిన పెండ్లికిని లోకజ్ఞాన మెఱుంగని స్థితియందైన పెండ్లికిని భేదముకలదని మీరందరొప్పుకొందురు. ఏకారణమువల్లనైతేనేమి లోకంలో బాలవితంతుసంఖ్య దినదినాభివృద్ధినందుచున్నదని నేను మనవిచేయుచున్నాను. ఖండాంతరములాదెచటను వితంతుజీవనములేదు! స్వచ్ఛముగ వితంతుజీవనముచేయుటవలన గలుగు చిత్తశుద్ధి—యింద్రియనిగ్రహము—దివ్యజ్ఞానపరిపాకము బ్రహ్మచారి మొదలు బ్రహ్మజ్ఞానివఱకునుండవలసినవే! కాని యెతరగతికి నిట్టికట్టుబాట్లు లేనప్పుడు తమప్రవర్తనాఫలితముగ నిట్టి దురవస్థప్రాప్తించినదని యూహించుటకు వీలులేనప్పుడు—నిరంతర దుఃఖభాజనమగు వైధవ్యమును—నిర్బంధసాంఘికప్రయోగమున ననుభూతమగుచున్న వైధవ్యమును— ఆమరణాంత సౌఖ్యవిద్రోహమగు వైధవ్యమును—పాపము! లేచెక్కులందు యౌవనము తొలుకాడుచుండ—సర్వాభరణ వాంఛానైస్పృహ్యమున హృద్పద్మము ముకుళితమగుచుండ—ముమనళ్ళగు జననీజనకులు నత్తమామలు తమకట్టెదుట శయ్యాగారము చొరఁబడి సరసగోష్ఠి నానందించుచుండ చూచి కండ్లుగాయలుకాచి పరిశిష్టాయుర్దాయమునకాలమృత్యుపరిధానమున భద్రపఱుచుచున్నారు! ఛీ! ఛీ! మనహృదయములు శిలాసదృశములు—మనప్రేమ కపటప్రేమ మనయోదార్యులు దయారహితములు!—మనకృత్యములు స్వార్థపరములు! భళీ! సంఘసంస్కారులమని బీరములువల్కుచు సంఘదురాచార రణరంగమున పదనులేని కరవాలము నక్రమగతిఁద్రిప్పుచు నిష్ఫలయోగమున కాహుతియగుచున్నారు! ఉపన్యాసపీఠములనెక్కి వితంతూద్వాహ మవశ్యాచరణీయ

కుని వాదించు [illegible] స్నేహితులగు బాలికా
మణులు [illegible] గుదురు! కొందఱు
దుఃఖజీవిత శేషమును [illegible] కాలపస్మరణము నాహ్వా
నించుచున్నారు! మఱికొందఱు [illegible] గవడిన మనస్సులతో చిర
రోగులై మంచముపట్టుచున్నారు! మఱికొందరు యౌవనప్రా
ప్తురంగములఁ పగ్గములఁబట్టఁజాలక కామ్యక్షేత్రముల ననర్గ
ళముగ బోనిచ్చుచున్నారు ! ఏమీ! వారుమాత్రము ఈశ్వర
సృష్టికాదా! వారికి చాపల్యముండకూడదను సిద్ధాంతమా?
శతవృద్ధున కష్టాదశవివాహములా! నవకోమలాంగికి శుష్కోప
వాసములా? ఎంతకఠినశాసనము! పాపమా యభాగినుల జీవి
తసుమములిట్లే వికసించి, నశించి భూపతనమై పాదప్రహార
మున చూర్ణీకృతముకావలసినదేనా? మిత్రులారా! మీసోదరీ
మణులు, బిడ్డలు నిట్టియనిర్వాచ్య నిర్బంధవైధవ్యమును అను
భవించుట మీకు హితవా? లేక పురుషులవలెనే, పునర్వివా
హితులై సమస్తానందభోగముల ననుభవించుచు ప్రియోల్లాస
ముల తమ జీవితములను సౌఖ్యముగ గడపుట మీకుహితవా!
వినుడు! మీ హృత్కర్ణముల నాలకింపుడు! కలికాలమున
వితంతూద్వాహము సర్వపాప పరిభంజనియని పరిఘోషమొ
నర్చుచున్నది. రండు! సాహసించి ముగ్ధలగువారి జీవితలతకు
సంస్కార జలధారచే నవ్యకళలనొసగి, ఫలపుష్పలతాదుల
యుత్పత్తిచే మనకందఱకు గలుగు యానందమనుభవించుడు!
ధైర్యమవలంబింపుడు! శాస్త్రము దూష్యముకాదుకాని ప్రా
కృతమున—కలికాలమున తేజోమయమగు భారతశక్తి నిర్వీ
ర్యము గాకుండగ గాపాడుడు! మనబిడ్డలసౌఖ్యము—మనసోదరీ
మణుల ప్రణయోచిత భర్తృపదసేవా పరాధీనత మనపూ

ర్వాజన్మార్జిత సుకృతమున లభించును! గాన సాహసించి స్త్రీ పునర్వివాహసంధాన సహాయాంధులై నాకభయ మొసంగుడు! మీ అదటి సముఖమున నాయనహ శతసహస్ర శాఖావలె విజృంభించునట్లు సేనుబసచే సెవనవివాగ్దత్తము చేయుచున్నాను.

అందఱు — మీ యుపపాదితము సర్వాత్మముఖముగ నంగీకరించితిమి! తప్పక నాచరింతుము!

సుందరం — (లేచినిలుచుండి) నమస్కారింతును! మీరందఱు మన మోహనరావు, వెంకటేశ్వర్లుగారు చెప్పిన విషయాలు "ఓహో!" అని అంగీకరించారు! నాగోడవకూడా తప్పక Pass చేస్తారని నానమ్మకము!

అందఱు — ఏమిటో చెప్పండి!

సుంద — ఏమీ లేదూ! చిన్నపిల్లల పెండ్లిండ్లు, వితంతువివాహాలు, ఊరికే చేసేస్తామని టప్పాలుకొట్టేస్తున్నారుకదా! ఇంకోసంగతి కూడా అంగీకరించాలి! సతంతులైనా, వితంతులైనా లోక జ్ఞానము, విద్యుక్తధర్మము, వ్యవహారిచర్య, శిశుపోషణము మొదలయిన ధర్మసూత్రాలు గ్రహించి అవసరమైనప్పుడల్లా అస్త్రాలాగ ప్రయోగించగలిగితే మానవకోటిలోపుట్టిన ప్రయోజనమేయుండగు! సంసారమంతా కష్టభూయిష్టము! ఏదో ఎల్లప్పుడూ స్త్రీ యింట్లోయుండి ఏకూ చింతా అనుభ విస్తూ కష్టసుఖముల కాధారమైయుండి దిగ్దర్శనియంత్రంలాగ మగాడికి న్యాయమార్గం చూపిస్తూండాలి! అందుకని కొంచె మో, గొప్పో విద్య ఉండాలికదా! ఆవిద్య మనం వాళ్ళకి ప్రసాదించాలనికాదూ మనమనుకొంటున్నాము? అట్లాగే సాహసించి ఉద్యోగులు చేయించి ఊళ్ళేలించడానికి శాకపోయ్యి

నా యింట్లో శుభ్రిత, మనోనైర్మల్యము, భక్తి, మున్నగు సుప్రసిద్ధవిషయాలు సులభంగా గుర్తించగలిగేటంత విద్య ఆ వశ్యమా కాదా!

అందఱు—తప్పక అవశ్యము!

సుంద—మీరందఱూ యీ పద్ధతిని మీ ఆడంగులకు బహిరంగ పాఠశాలల్లో కాకపోయినా యింట్లో అయినా విద్యా ప్రదానము చేయిస్తామని ప్రమాణం చేస్తారా!

అందఱు—చేశాము—చేశాము!

సుంద—సరే! నేను ధన్యుణ్ణి!

శర్మగారు—(నిలువఁబడి) ఇంత ఘోరంగా తీర్మానాలుజరిగిపోయాక నామాట తుపానులో ఎగిరిపోతుంది! మీరందఱికి శాస్త్రం ఎనుపోటులా తగులుకుంటూండాలి! మీవంటివాళ్లు అంతా బయలుదేరాక శాస్త్రం.........యీరకంలోచేరింది గాని శాస్త్రప్రకారము శుభకార్యాలు జరుపబట్టే మీతాతముత్తాతలు నూతేళ్లు బ్రతికేరు! ఆనమ్మకం పోయాకే అర్థాయుర్దాయం నృత్యం చేస్తోంది! శాస్త్రం ఎందుకో గ్రహించలేకపోయారు! కొన్ని కట్టుబాట్లలో ఉంటేనేగాని ఏ మనిషికైనా యిదినాది—యిదిన్యాయము—యిదిభోగ్యము అనే విషయాలు నిర్ధారూగావు! అట్లా లేకపోతే పెండ్లిమాత్రం ఎందుకు? 10 రోజులూ ఎడాపెడా వందమంది చేరి ఎవడో ఒకవ్యక్తిని పూర్ణంచేయడంకోసమా? సరే పెండ్లి అయాకకూడా నా పెండ్లాము అని గింజుకోవడం ఎందుకు? ఇది పుణ్యాస్త్రీ అనుకోడం గారడీకోఱకా పతివ్రాత్యా పుణ్యాంగనలే అనుకో కూడదూ? గనుకా—

అందఱు—ఇక కూర్చుంటె బాగుంటుంది, చాలదూరం పోతున్నారు

[illegible]—ఉత్తము యింకామాట్లాడితే మీరుబహూకరిస్తారుకాబోలు !

(అని కూర్చుండును.)

నరసిం—ఈసభలో చర్చింపబడ్డ విషయాలు చాలచాలాముఖ్యమైనవి నేనామోదించాను ! ఈసభ చిరస్థాయిగా ఉండటానికి ప్రతి సంఘసంస్కారప్రియుడు ఒక్కొక్కరూపాయి యీఆఫీసుకు పంపాలి ! వెంటనే కార్యక్రమము ప్రకటిస్తాము. సంఘసంస్కర్తలు వారిని పరమేశ్వరుడు రక్షించుగాక !



శుభమస్తు.

# సతీసక్కుబాయి

ద్వితీయాంకము.

ప్రవేశరంగము.

దేవునిగూర్చి పాడుతూ శివనాధయోగి ప్రవేశించును.

అనుబంధము 2

శివ— నళినీదళగత జలమతితరళం
తద్వజ్జీవిత మతిశయచపలం
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతంచ సమస్తం ॥భజగోవిందం॥

సర్వవిధముల యత్నించి, పుణ్యాత్ముల సాంగత్య విశేషమున నింతవఱకు నిగ్రహశక్తి పూర్వకముగ క్షుత్తును సంహరించితిని గాని మఱి మఱి బీడించు దప్పిని మాన్పించుట సాధ్యము కాకున్నది! పరమేశ్వర లీలాచింతనామతృపాన ప్రమత్తతచే నదియు దవుదవ్వుల కేగుచున్నది! మానవునకు వశముకానిదెద్ది?

సీ. క్రిమ్మవచ్చెడి వేగు చుక్కబింబంబులోన నీ
సేవ స్వస్తి గాంచ కొనును !
తళతళలాడు జ్యోత్స్నాపథములందు నీ
దరహాస మృదురేఖ తాండవించు !
జల్లల్లు నడ్డల్లు చల్లని వర్షాంబు
కణముల నీకృప క్రిమ్మియుండు !
ఉదయాస్తమయవేళ నుదితవర్ణంబుల
నీవిలాసమ్ము ఘనీభవించు !
గీ. నిలువు నన్నాంగి క్రిందగెడు నీరనిధిని
గూఢమగు నీదుమహిమంబె గోచరించు !
నీమహిమఁ బూర్తిగ నెఱుఁగ నేర నేను !
ప్రథిత కరుణాంతరంగ ! శ్రీపాండురంగ !

అశాశ్వతంబగు—వపురస్థిమాంసపుంజంబగు —కాయము ననవరతము పెక్కుభంగుల పోషించి కాపాడినను తుదకాపరంధాముని పిలుపుమీద నగ్నికాహుతియొనర్చి యేకైకాంగుళమాత్రంబగు జీవుండు పరమాత్మను గలియుచున్నాడు ! శాశ్వతంబగు దైవసాన్నిధ్యం బపేక్షించిన వారి కిహలోకసౌఖ్యంబులు తృణప్రాయంబులు (అని పాడుకొనుచు నడచుచు సక్కుబాయి యింటిగుమ్మము సమీపించును)

సక్కు—(ఇంటిలోనుండి శివనాథయోగి పాటలాలకించి తలుపు తెఱచును)

(తేనలో)

ఉ. ఏయట వీసుమావళినో, ఏయపురూపమనోజ్ఞచంద్రికా
చ్ఛాయలనో ప్రశాంతమగు చల్లనివాసనవోలె హాయిగా
తీయఁగ, తేనెవెల్లువల తేటగ వీనుల విందుగా సుధా
పేయములై వినంబడు ! పవిత్రము లీతని భక్తిగేయముల్

ఓహో! విరాగియగు నీతఁడొనరించు దైవప్రార్థన మె తశ్శావ్యముగ నున్నది! అమృతము చిప్పిలుచున్నది! ముద్దులు మూటగట్టు చున్నది! ఇంకేమిపాడునో వినవలయు (అని యొక గుమ్మము దిగినిలచును)

శివ—(సమీపించి) అమ్మా! కొంచెము ఎప్పించేట మంచితీర్థమొసఁగుదువా?

సక్కు—చిత్తము! (అని లోనికేఁబోయి జలముఁదెచ్చి యిచ్చును)

శివ—ఆహా!

గీ. పరమభక్తిపరిపూర్ణ యీతరుణి జలము
నీయగఁ జూడదగతీరె! హాయిఁకలిగె!
క్రోలినంతన వింతతాకోర్కెలూరె
నమృతసమములీ నిర్మలాంబురుచులు.

గీ. విష్ణుపదమునబుట్టి పవిత్రమగుచు
నీశ్వరుని జటలందు నర్తించినట్టి
పావనమ్మగు గంగ నాపాపములను
నాశనమొనర్చె నెంతపుణ్యమ్మొతల్లి.

సర్వకిల్బిషాపహారియగు దివ్యాపగా జలముకంటె—నమృతతుల్యమై—లక్ష్మీసనాథ పాదపద్మసంజనితామృత జలోపేతమై—దివ్యమై వెలయునీతీర్థము నేనెన్నఁడుఁ గ్రోలియుండలేదు. నీవు మహాసాధ్వివి! సత్యమగు భక్తురాలవు! కాదుకాదు! భక్తజన పారిజాతమవు! నీవంటియోగ్యను నానాదేశములఁ గుమ్మరినను నేను పొడఁగాంచలేదు! నేటికి నేను ధన్యుఁడనైతిని నీ నామాంకిత సువర్ణాక్షరములేవి తల్లీ!

సక్కు—మహాత్మా! అజ్ఞానురాలనగు నన్ను మీరట్లు కొనియాడఁ దగదు! మీనోటవెలువడు నొక్కొకమాట కొన్ని యోజనము

లీబాందెను కైలాసమార్గమున నడిపించుచున్నది! భక్తియే మోక్షదైవచింతయును నెట్టిదో యెఱుంగని మూఢను! సాంసారిక పాశబద్ధనై—స్థిరబుద్ధితో నొక్కసారియైని మహాఘ్యధూసరా వృతచిత్తప్రతిమను పరిష్కృతమొనర్చి గుప్తమగు నీదారు ప్రతిమను జేర్చజాలకున్నాను! పాపము! మాయత్త—

అత్త—ఏమిటే! యేకాంతంగా మాఅత్త అంటూ వీడితో మొరెత్తు కుంటున్నావు? వీడెవరు? ఏదొంగముండా కొడుకో! నీకు వీడికి ఏంసంబంధమే! ఉన్నదేదో వేళకు కొంచెము తిని యింట్లో ఏడవక బైరాగాళ్లతో సరసాలేమిటే! నీ యిల్లు వల్ల కాడుగాను! నీతో చెలికట్టుకొని పోరలేకుండా ఉన్నానే! అడుగు దూరములో వీడిని చేరదీసి నామీద నేరాలు చెప్పు కొంటున్నావా? దొంగ పీనుగా (అని మోదును)

శివ—హరి హరీ! అమ్మా! ఆసాధ్వి మహాయిల్లాలు! అట్టి సతీమ తల్లులింకను భారతభూమియందుండబట్టియే మనవంటివారికి తినుటకన్నము లభించుచున్నది! పాపమామె యేమియు నేరము చేయలేదు! యెందులకట్లు కఠినముగా దండింతురు నేను బోదెదను! ఆబిడ్డను క్షమింపుడు!

అత్త—అయిందేదో అయింది! ఇంక వెళ్ళవూ! ఏచెంబో తప్పేలో అందిస్తే చల్లగా జారతావు. పైగా ఆవిణ్ణిక్షమించండి నేనుపోతా నంటావు నువ్వెవడవు ఆలా వెధవసమాధానం చెప్పడానికి! ఎక్కించేదేదో ఎక్కించి బుద్ధిచెఱిపేసి చల్లగా దయచేస్తావు! నిన్ను మళ్ళీ యీ వీధికి రాకుండా చేయాలి! మావాణ్ణి! పిలుస్తా! నీపొగరు దీనిపొగరు పొట్టుచేస్తా! ఓరే! విశ్వేశా నీపెళ్ళాం ఎవడితోనో రహస్యంగా లేచిపోతోంది తొరగారా!

విశ్వే—(కుగుక వచ్చును) ఏడీ! ఏడీ! అమ్మ నీతల్లికడుపుకాల! చచ్చిచెడిపోడ్లాడితే దీన్ని నీవు దఖలుపరుచుకుంటావా! ఎవళ్ళా వీధిలో లేనిసమయంలో పడుచు దానితో నీకేమి సంభాషణ! ఏంకావలెకార్యం? ఒళ్ళుపొగరెక్కి ఏడుస్తున్నావా! సన్యాసి ముండకొడుకా! చెప్పుదెబ్బలు తింటావు! గాడిదె! (అని గెంటును)

సక్కు—అయ్యో! ఏదుర్ముహూర్తమున నామహాత్ముండు నేడు లేచెనోగదా! ఈయిద్దరు నజ్ఞానులై క్రూరముగా దండించు చున్నారు! అట్టిపుణ్యశీలునను నిందించుట మహాదూష్యము గదా! నేనేమిచేయుదును! నామూలమునగదా! నాతనికింత చేటుకలిగె? (క్రోశముగా) నాథా! మీరకర్ముముగ నా పూజ్యుని నిందించుచున్నారు. దుర్భాషలాడుచున్నారు—అది పాపదాయకము—(అని యింకాచెప్పబోవుచుండ)

అత్త—అబ్బాయీ! మనబంగారం మంచిదైతే కంసాలివాణ్ణి అనడం ఎందుకు? పెంకెమాటలు చెప్పకుండా దీని మూతిమీద వాయించు! చూడకు! కొట్టు (విశ్వేశం కొట్టును) అయిందా! ముండపీనుగా! ఎన్నిమాట్లు చెప్పనే! పొద్దున్నుంచి బొమ్మతో ముచ్చట్లు బైరాగితో ముచ్చట్లునా? చచ్చేలాగ పొడిపిస్తా! చెప్పినమాట వింటినే విన్నావు! లేకపోతే నీతిప్పలు కుప్ప తిప్పలవుతాయి!

శివ—ఏమి సాహసము! అమ్మా! సర్వసంగపరిత్యాగినై పరమేశ్వర ధ్యానాసక్తుండనై ఒకచోటనక—ఒకబాటనక పలుతావులం గ్రిమ్మరుచు నావంటి దీనునకాయమ్మ యొసంగిన గ్రుక్కెడు జలంబులకింతటి దండనయా? మీకు క్షుత్పిపాసలు లేవా? నా యాత్మ మీరాలకించినచో మీగుమాత్రము దాహమొసంగ

రా! అట్టి దయాహృదయుఁడగు వాతల్లి పుట్టినిల్లు మొనర్చుకొ న్నది! మీతో నరించు దంభన యామెకు ద్విగుణీకృత ధర్మాభి రతి కలిగించును.

విశ్వే—అరి నీతల్లి కడుపుకాలా! యీవేళ గుర్రకాడు నీళ్ళంటావు—రేపు తులం గంజాయి అంటావు—ఎల్లుండి అర్ధసేరు కల్లంటావు ఆఖర్ని సేరు సారాయంటావు! నీకేం! భక్తి పిచ్చిలో కి మాటి పోతే యీముండ యిల్లంతా గుల్ల చేసేస్తుంది! వడుచుకొన్న లిస్తే కాని నీదాహం తీరదూ!

శివ—హరి హరీ! ఇదేమి వాగ్ధోరణిస్వామీ! ఎచ్చట నిట్టి దుర్భాషలు వినియుండ లేదు. మీహృదయములందా పరేంగిత జ్ఞానలేశ మేల లేదు?

అత్త—విశ్వం! ఈమొండిపీనుగుని అవతలకి యీడ్చేస్తేనేగాని ఎంత మాత్రం యీగొడవ చల్లారదు! వీడి మొహంచూస్తే నాకేదో అసహ్యం వేస్తోంది! పేడనీళ్ళు యిల్లాపట్రా మొహంనిండా చల్లుతా! (అని నీళ్ళు తెచ్చి మీదచల్లును)

సక్కు—అత్తగారూ! స్వామీ! మీరా యుత్తమపురుషునిగూర్చి నిక్కిలి పొరఁబడుచున్నారు! మీరు తెలియఁజాలకాయన నవ మానించుచున్నారు. అట్లు చేయకుఁడు! మీకు మొక్కెదను! పాపమాయననట్లు కసరకుఁడు! నేనాయనను పంపివైతును!

విశ్వే—నువ్వు రమ్మన్నావా—నువ్వుపొమ్మంటానికి! వాఁడే వచ్చాడుటగాదూ! అల్లాగే వాఁడే పోతాడు! పోకపోతే నేను పంపించగల! నీమెట్టవేదాంతము—బొమ్మలాట, వాడి బైరాగివేషము—దొంగనటన నే నణచేస్తా!

సక్కు—ఇందేమియు నసత్యములేదు! ఆయనకీర్తించు పార్థన నొక్కటి యాలకింపుడు! మీహృదయము నవనీతతుల్యమగును—

ఆ మనవృత్తియే దైవభజన—ఛీ—రనునట్లా పరివర్తనమంతయు గల్లయైన కానిమ్ము! మనకు పోవునదేద్ది? మనహృదయపేటిక యందొక మహాత్మకమును భద్రపరచిన వారలమగుచున్నాము!

(అత్త యింటిలోనికి బోవుదురు)

అయినదేదో అయినది కాని అమ్మా! ఒకవిషయమా మహాత్ము నడిగి పంపివైచెను! సెలవిచ్చెదరా?

విశ్వే—మాఅమ్మొస్తే నన్ను చంపడం కాకుండా నన్ను చీరేస్తుంది! లోపలగా ఏడు

సక్కు—మహాత్మా! ఈసంసారజలధినుండి సులభముగా దరిచేరు సాధనమెద్ది?

శివ—సర్వకాలములందును శ్రీపాండురంగవిఠలుని స్మరించుటయే!

సక్కు—నావంటివారలకట్టి స్మరణకవకాశము లేకున్నచో

శివ—దురభిప్రాయదూరులై అవకాశలేశము లభించినప్పుడే చాలు తల్లీ! నీవంటి యుత్తమవనితలకు కొంగుబంగారంబగు పతిభక్తిని మించిన మహావ్రతమేమిగలదు! అమ్మా నావంటి దీనులందఱు నీసాన్నిధ్యమున నిలచుటకైన తగుదుమా?

అత్త—(తనలో) ఈవెధవకూడా దానితో ఏకమైపోతున్నాడా ఏమిటిచెప్మా! అదే అటవస్తే నాగతిచెప్పాలా! అయినా నాకంఠంలో ప్రాణమువుండగా వీళ్ళిద్దరు ఒకమాటమీద ఉండడము జరగదు! నాఅత్తగారు నన్నెట్లాకోడిరికం పెట్టిందో అల్లాగే దీన్ని ఎగేసి తెగనఱుకుతా (ప్రకాశముగా) ఒరేబాబూ నిన్నీమాయలాడి మంత్రించల్లి పిచ్చెక్కిస్తుంది! వీడెమ్మకడుపుపాక్కా—ఛీకుంకా వాదల్లేదూ? దానిమొల్లోవుండే బొమ్మ

కోసం బెంగపెట్టుకొని ఏడుస్తూంటే కామారంజేసిలాగ పక్కి రుబ్బుకలాగ నీడెక్కడ దాపరించావురా బాబూ!

(అని నీళ్ళు మీదచల్లును.)

శివ—ధన్యుఁడను తల్లీ! నిష్కల్మషచిత్తవగు నీవు నాపైఁజిలికినయీ యుదకమత్యంత పవిత్రమై నాపాపరాసిని నాశనమొనర్చినది! అమ్మా సంసారము మాయాజాలనిబద్ధము—కపటనాటక రంగము—పుర్గమ దుఃఖారణ్యము—యిందు నరులు తెన్నుఁగానక చిక్కువడి యల్లాడుచున్నారు—నీవంటి యుత్తమాంగనలు తద్విషయమును శ్రద్ధతో గుర్తించి కుజ్జల కుద్బోధించనిచో వారికి ముక్తి సాధ్యమెట్లగును!

కామం క్రోధం లోభం మోహమ్
త్యక్త్వాత్మానం పశ్యతి సోహమ్
ఆత్మజ్ఞానవిహీనామూఢా
స్తే నసన్నంతిచ నరకని గూఢాః ॥భజగోవిందం॥

కామక్రోధాదులు మన జీవితాంతఃపురమున స్వైరవిహారమొనర్చినచో భక్తిధనము పూర్ణముగ నపహరింపఁబడును. ఆచోరుల కెడమై మనబుద్ధి దివ్యజ్ఞాన దీపికాధారమున వారిని పసిపట్టి తరుముచుండును. ఇట్టి వయస్సునగూడ మీరాయరిషడ్వర్గమున కానుకూల్యత నొసంగినచో మీకు తరుణోపాయమూహింపజాలము సక్కుబాయి మీయింట దివ్యజ్యోతి ఆపె తోడ్పాటున మీరు సమస్తాజ్ఞానాంధకారమును పటాపంచలు గావించుకొనుడు. ఆమెదివ్యజ్ఞానకల్పతరువు—ఆమె యొసంగు సద్బోధనామృత ఫలరసంబుల దనివితీఱ కర్ణాంజలులఁ గ్రోలి తనియుఁడు. ఆమె మీపూర్వార్జిత సుకృతపరిపాకంబున లభించిన యపరభారతి మీరుగాదు—నేనుగాదు ఈయఖండ

భారతావనింగల పుణ్యుల పున్నమంతయు నాపెయొనర్చు నోకొక్కకర్దైవకార్యమున కెనంగావు. మీరామెను నిర్బంధించుచున్నామని భ్రమించుచున్నారుగాని సతతశ్రీరంగాభిధాన స్మరణాయత్తమగు నాపెచిత్తమును బంధింతురా, పాంచభౌతికంబగు నాయమకాయమును క్లేశపరతురేకాని నిరాకారమును నిర్వాంఛితంబునగు నాత్మను హింసించుట మీతరమా? శరభృద్వాయసము లొక్కయాకృతి నుండుటంబట్టి కంఠము రెండింటు సమముగ నుండవలయునన్నట్లు సహంజననుగ నాయబను మీవలెనుండవలెనని గాజియువెట్టవలదు.

మజీరియొక్కమాట! ఆపె చెంతంగల ప్రతిమ సామాన్యమైనదికాదు. ఆ ప్రతిమయందే బ్రహ్మసర్వమంగళప్రదుండగు—చతుర్దశభువన రక్షా దక్షుండగు—శతసహస్ర గోపీజనాశ్రితుండగు మిథ్యాజగన్నాటక వీక్షణానంద పరవశుడగు భక్తజనసులభుండు పాండురంగను మూర్తీభవించియున్నాడు.

గీ. పరమపావనమైన యీప్రతిమయందు
భక్తసులభుండు మాయాప్రపంచ చక్రి
వర్తిలోకత్రయీనేత పాండురంగ
విఠలదేవుండు! మూర్తీభవించి వెలుఁగు.

మీరాప్రతిమ సపహరించినను నక్కబాయి తలంచినమాత్రాన జగద్వంద్యుడామెకు సాక్షాత్కరించును ఆమెను మీరు క్షమింపుడు సమస్కారము తల్లీ సెలవు.

విశ్వే—అమ్మముండాకొడకా! ఎంతగుర్క్కతిప్పకుండా దండకము చదివావురా! అయితే నువ్వు నాపెళ్లాన్ని దేవుళ్లాగ చూసుకోమంటావేమిట్రా! ఇంక అదితెరవాయి. ఇంతవరకూ ఏదో కాసినిసీళ్ళు తెచ్చినట్లు ఏదో ఆపనీ యీపనీ ఏడుస్తు చేయడమున్ను

వుంది. నీప్రసాదమువల్ల అదికూడా పోవడమేగాకుండ నన్ను వంటవాడిగావుండమంటావు! దేవుడో, దెయ్యమో, నీయిష్టము వచ్చినట్లు నువ్వువుంస్తే బాగుంటుం దికాని మాకెందుకీగోల? ఇదిగో దయుంచి యింక యీవీధికిం కురా వెర్రిబైరాగీ! మా అమ్మ రాక్షసిముండ! చల్లచల్లగా పాలుగు ఒడ్డిస్తే యీవూళ్ళో నీకడ్డుపడే దిక్కేలేదుసుమా !

అత్త—ఇల్లాటిజోగులు నాముందఱె దర్రైనారు? మొన్న యిల్లాగే బైరాగాడు ఒకాడొచ్చి "అమ్మా! నిది మహాగొప్పజాతకము! ఎంతపుణ్యాత్మురాలవు? నీవంటిజాతికము ఎక్కడా లేదు—" అని ఊరికే చెప్పేశాడు. "అమ్మగాడిదకొడుకా నాసంగతెల్లా గ్రహించా"వని అడిగి "యింకా చెప్పు"మన్నాను. "మీరు యీతాటాకుయిల్లువిడిచి మేడలోవుంటారు. ఒక్కపనిచేస్తే ...అన్నాడు ఇంకేంకావాలనకొని "ఏమిట"దన్నాను. ఈ చేతిలో రెండురూపాయలుపెట్టండి చెబుతా నన్నాడు తక్షణం రొంటినున్న బోడిరూపాయలు రెండయిచ్చేను." అబ్బే! "ఏమీలేదు మీరు నాతోకూడారండి మంత్రమువేస్తాను చక్కని కొడుకు.........."అన్నాడు. ఆమట్టున నీదుంపతెగ యెంతమాటన్నావురా అని మూలనున్న రోకటితో మూడు పోట్లుపొడిచా చచ్చేనురాదేవుడా అంటూపోయాడు వెధవ వాడు నీకంటె రాయిలాగున్నాడు. అలాటిదెబ్బ ఒక్కటి తగుల్తే నువ్వు మళ్ళీమాట్లాడవు. జాగ్రత్త! నడు!

(అని కొట్టబోవును.)

(శివనాథయోగి పోముచు పోవును.)

అనుబంధము. 3

## ద్వితీయరంగము.

---

భారతమహిళాసభామందిరము.

ప్రవేశము:—సుందరమ్మ, నరసమ్మ, మాణిక్యము, జానకమ్మ, వితంతువు, అద్వైతమ్మ, మరికొందరు సభ్యురాండ్రు.

నరసమ్మ—(లేచి) కమిటీమెంబర్లను ఆదరముగా రావడమువల్ల సభామందిరము నేడు కలకలలాడుతున్నది. ఈవేళ యీఅసాధారణసమావేశము (Extraordinary Meeting) కాల్‌ఫర్ (Call for) చెయ్యడానికి కారణము మీరు గ్రహించేవుంటారు నేటిసభలో స్త్రీస్వాతంత్ర్యము, స్త్రీవిద్య, వితంతువివాహము మొదలైన నారీజనోపయోగములైన విషయాలు చర్చించి తీర్మానాలు ప్యాసు (Pass) చేసి అవి మన సోదరీమణులచేత ఆచరణలోపెట్టించాలి. మన అందరిలో నాయకురాలుగావుండి యీమహిళాసభామందిరంనిర్మించడములో విశేషసాహాయ్యము చేసిన శ్రీమతి కలవచర్ల సుందరమ్మగారు యీసభకు అగ్రాసనాధిపురాలుగావుండుటకుదయతో అంగీకరిస్తారని నానమ్మిక.

జాన—(బాలవితంతువు) అది మాకందరకూ సమ్మతమే.

మాణి—నేను మీ ప్రపోజలు (Proposel) ను ఆమోదిస్తున్నాను. (సుందరమ్మలేచి, కుర్చీదగ్గరకు వెళ్ళును. అందరు చప్పట్లు కొట్టుదురు )

సుంద—సోదరీమణులారా! నన్ను మీరు అగ్రాసనాధిపురాలుగా ఎన్నుకొని, నాభుజముపైన మోయరాని భారము ఉంచినారు. నేను మీవంటిదాన్నే అబలనే మీకంటెనాలో ఆధిక్యము ఏమీలేదు. మనం మామూలుగా ప్రెసిడెంటు సెక్రిటరీ అనుకున్నా, కార్యక్రమం అందరమూ సమానముగా జరపాలి

అందరమూ కలిసి పనిచెయ్యకపోతే మనసభ, మన ఆశయా లూ అన్నీ మూాగురోజుల్లో మంటకలుస్తాయి. మూడునాళ్ళ ముచ్చట అని ఫ్రెండ్సు (Friends) మనలను గేలిచేస్తారు. ఆ అవమానదుఃఖం ఇంటోలరబుల్ (Intolerable) (దుర్భరం) గా ఉంటుంది! మీరందరూ సావధానచిత్తులై మనంచర్చించుదలచుకొన్న తీవ్రవిషయాలు, విషమసమస్యలు విని, ఎవరికి తోచిన సలహాలు వారిచ్చి, సాధ్యమైనంత త్వరలో ఆచరణలో పెట్టించాలి ఇప్పుడు స్త్రీస్వాతంత్ర్యాన్నిగురించి, మనలో ఆంగ్ల విద్యావిశారద శ్రీమతి సరసాబాయమ్మగారు ఉపన్యసిస్తారు. వినండి. (కూర్చుండును చప్పట్లు)

సర—(లేచి అగ్రాసనాధిపతి బల్లదగ్గరకువచ్చును. కరతాళధ్వనులు) సోదరీమణులారా! సకలశాస్త్రవిశారదలైన మీాసమక్షమున నేను నేడు స్త్రీస్వాతంత్ర్యం అనే విషయాన్ని గూర్చి నాకు తెలిసిన మట్టుకు చెప్పడానికి సాహసిస్తున్నాను. నాయీాచిన్ని ఉపన్యాసంలో ఏమైన మిస్టేకులు (Mistakes) ఉంటే ఎక్సు క్యూజ్ (Execuse) చేయాలి వినండి మనదేశపు పరిస్థితులు ప్రస్తుతం ఏమీాబాగుండలేదు హిందూమహమ్మదీయ సమ్మేళ నసమస్య, సహాయనిరాకరణోద్యమపు సమస్య, ఉద్యోగస్థుల జీతముల సమస్య, అది యిది యననేల అనేక సమస్యలు మనల నెమరొకని ఎంతో బాధకలిగిస్తున్నాయి. యీాసంధిగ్ధ సమయంలో, ఉద్యోగాలు దొరక్క పురుషులు అల్లల్లాడుతూ కుటుంబపోషణానికై తేనేం, తమసిగరట్, బీడీ, బ్రాంది, కాఫీ వగైరా దురల్వాటులకైతేనేం మనమెళ్ళలోని పుస్తెపూసా తెగనమ్మి, మట్టిబొమ్మల్లాచేసి వదిలిపెడుతున్నారు. పోనీ, ఎంత ఉద్యోగాలు సంపాదించలేక గాజులు పట్టిగాజులు గొడు

సిల్కు-గాజులు ధరించి, యింట్లో మూలకూర్చుని, వస్తుంటే దానివల్లా, అదిలేకపోతే పనగల్లో తాకట్టుపెట్టే తింటూ కూర్చుంటే కాదంటామూ? చెప్పండి వీళ్ళపోకులకి ఏమిటాలో టురా.కూడదు. తెల్లవారేటప్పటికి మంచంమీద ఉండగానే పాచినోటితో తాగడానికి, సిగ్గేనా లేదమ్మా మగజాతికి, (హీయర్ హీయర్ Hear, Hear అను కేకలు) బెడ్ కాఫీ అట అది తగులడ్డాక వళ్ళుతోముగోవడానికి టూతుపేస్టు, బ్రష్ (Tooth paste & Brush) నూ, పెద్ద ఇగ్లీషు వాళ్ళకి మల్లే ఏం పుల్ల కాని, క చి క తా టూ కూ పనికిగావేం తర వాత డ్రెస్ వేసుగుని ఊళ్ళోఫ్యాషికార్లు 10 గంటలకి వేళతప్పకుం డా అప్పచేసి అ.కుక్కు-తింటున్నాసరే వేపుడుకూరలతోటి భోజ నం నిద్ర, మూడింటికి టిఫిన్ వెంటనే నెత్తికి ఏపాంపియూ హే రాయిలో పూసుగుని, చేత్తో హ్యాండ్ కేన్ (Hand canc) కట్టు గుని చంకలో టెన్నిస్ బ్యాట్ వుంచుకొని టౌన్ హాలుకి ప్రయా ణము. అక్కడ కిల్లీకొట్టువాడికి యివ్వాలేయని వంకపెట్టి ఏ రెండోమూడో తీసుకువెళ్ళి రిఫ్రెష్ మెంటుహూమ్ వాడికి (Refreshment Room) దాఖలు చేసుగుని యిన్ని కంపునీళ్ళు కడుపులో పోసుగుని పూలుతు పేలుతూ హెచ్చుతగ్గులుగా మాట్లాడి ఎవరిచేతో వనడసాపుచేయించుకొని పమాలుగుతూ యింటికొచ్చి అవాకులూ చవాకులూ పేలడము ఇది మన మగవాళ్ళ వ్రిజెంట్ డైరీ Present diary) దీనికి కారణము ఏమంటారు? మన తెలివితక్కు-వ, మనమూఢత్వము, నోమోర్ దాన్ దీజ్ (No more than these) మన తలిదండ్రులుమనకు తెలియనప్పుడు బొమ్మలపెళ్ళిళ్ళులాగా చేసి మనకు వాళ్ళని అంటగట్టారు. మనము వాళ్ళపోరు పడలేక ఏడున్నాస్తూము

వాళ్ళకి లోకువ యివ్వడము అనే గొప్ప బ్లండర్ (Blunder) కమిట్ (Commit) చేశాము. బాగా ఆలోచిస్తే వాళ్ళకి లోకువయివ్వడానికి వాళ్ళ అనుజ్ఞల్లోపడి ఉండటానికి మనకు యీమాత్రమైనా అవసరములేదు. మనము చచ్చుగడ్డి మొక్కలాగ ఊరుకుంటే మీదెక్కి తొక్కుతారు. టుబి ప్లెయిన్ టుయు ఆల్ (To be plain to you all) ఒక్కమాట చెబుతా. ఈరోజునుంచి మీరు ఒక ఘోరమైన ప్రతిజ్ఞ చెయ్యాలి. మొగుడుమాట వినకూడదు. ఇంట్లో, కాపరములో, భర్తకి ఎంత స్వాతంత్ర్యమువుంటుందో భార్యకికూడా అంత స్వాతంత్ర్యం వుండాలి. లేకపోతే భర్తని (Divorce) విడిచిపెట్టెయ్యండి. ఆలోచించండి భార్యలేనిభర్తబ్రతుకు ఇట్ విల్ బిఎగ్రేట్ సైఫర్ (It will be a great sypher) (అదిఒక గొప్ప సున్న అగును.) మనముకూడా స్వతంత్ర్యం గావుండాలి భర్తకుండే హక్కులు, గౌరవాలూ అన్నీ మనక్కూడావుండాలి. రేపటినుంచేమీమీయిళ్ళల్లో యిండిపెండెన్సు Independence డిక్లేర్ (Declare) చెయ్యండి. నామాటవినండి బాగుపడండి. లేదా యింకా అధఃపాతాళానికి పోతారు. మీకు యీజన్మకింక మోక్షమువుండదు. కూపస్థమండూకాల్లాగ యిళ్ళల్లో పొయ్యిలదగ్గరకూర్చోవడముతోనే మీతనువులు వెళ్ళిపోతాయి నిస్సందేహముగా ఇప్పుడైనా కళ్ళు తెరవండి అమ్మలారా స్వాతంత్ర్యానికి సరియైనది లేదు. చెప్పండి ఒకఉత్సవముచూడ్డానికి వీలుందా? No నో ఒక్క ఎంటర్టెయిన్మెంటు(Entertainment) చూడ్డానికి అవకాశముందా నాట్ఇన్దిలీస్టు (Not in the least) ఇంకా యెన్నివున్నాయి? నీతిదాయకమైన నాటకానికి వెడదాములంటే ఏం అక్కడి కెవరైనా వస్తా

కాదేమిటి ఎవరినైనా లవర్సుని (lovers) రమ్మన్నావా యేమిటి అని అడ్డముగా అర్థములేని ప్రశ్నవేస్తారు. వారికి యీభోగాలు తప్పకూడదు. ఇంట్లో మనము రంభల్లావున్నా ఆస దూయీసందూ తిరిగి ఆగుడెసెలోకీ యీగుడెసెలోకీ దూరి చెప్పుదెబ్బలు తిని వస్తూంటారు. దారిని ఎవరైనా వెళుతూంటే 'వాడికేసి చూశావాలేదా' అని తన్నుతారు. వీళ్ళుచేసే దౌర్జన్యాలకి మనముకనక సహిస్తున్నాముగాని ఓర్పులేని మరో హాల్లైయితేనా కొంపకు నిప్పెట్టి లేచిపోతారు. (హియర్ హియర్ అని కేకలు) ఇంకనేను విరమిస్తా నాటైమ్ఫైవ్ మినిట్సు అయిపోయింది. మీరంతా నాకోరికలు నెరవేరుస్తారని నమ్ముతున్నాను. (సర్టెన్లీ Certainly అనీ, విథౌట్ ఫెయిల్ (Without fail) అని కేకలు (నరసమ్మ తన స్థానములో కూర్చుంటుంది.)

సుందరమ్మ—సోదరీమణులారా ! ఇప్పుడు స్త్రీవిద్య అనే విషయాన్ని గురించి శ్రీమతి మాత్రవాది మాణిక్యాంబగారు ఉపన్యసిస్తారు.

మాణిక్యమ్మ—(వేదిక సమీపించుచు చప్పట్లు) సోదరీమణులారా ! మీఅందరిలో తగుదునమ్మాయని వేదికదగ్గరకువచ్చి ఉపన్యాసంయివ్వ పూనినందులకు మన్నించండి. స్త్రీస్వాతంత్ర్యానికి స్త్రీవిద్యకి చాలాదగ్గిర సంబంధం ఉంది. స్త్రీస్వాతంత్ర్యాన్ని గురించి, మనసోదరి నరసాబాయమ్మగారు చక్కగా, గంభీరంగా విపులంగా ఉపన్యసించారు స్త్రీస్వాతంత్ర్యం వలెనే స్త్రీవిద్య అనే విషయంకూడా నేడు విషమసమస్యగా మారింది స్త్రీస్వాతంత్ర్యమునకు స్త్రీవిద్యచాలా అవసరం విద్యలేని స్త్రీ ఏమీకూడా చెయ్యలేదు. ప్రతిస్త్రీ విద్యాభ్యాసంచెయ్యాలి అంటే చాకలి పద్దులూ పెరుగు, నూని, నెయ్యి బాకీలు గోడలమీదా, క్యాలెండర్లమీదా వ్రాసేపాటిచదువుకాదు, నేను

వాలన్నారు. అన్నం అరాకలిగా తినాలన్నారు. తలవెంట్రు కలు గొరిగించుకోవా లన్నారు. ఒకటా రెండా, ఓ వెయ్యి శిక్షలు విధించారు ఇలా జగా నవాళ్లో ఉన్నారో లేక నాలాటి విధవల మొహాలమీద ... రుబకిఉన్నారో తెలి యదు. విధవని నిజంగా వెర్రివెధవకింద చేశారు. డబ్బుకోసం కక్కూర్తిపడి, ఎనిమిదేళ్ల పిల్లని ఎనభై యేళ్ళ ముసలి ముం డాకొడుక్కి ఏనాలుగయిదువేలో తీసుకుని అంటగడతారు. పదహారు రోజులైనా కాకుండానే ఆముసలాయనకాళ్ళు చల్ల బడతాయి. పట్టండి పట్టండి అని పిల్లమెళ్లో పుస్తె తెంపి, గాజు లు బద్దలుకొట్టి, గోదావరిఒడ్డుకు లాక్కెళ్లి బుర్రిడెక్కించి తీయించి మూల కూర్చోమంటారు మూడురోజులు, క్రమంగా నగలన్నీ అమ్ముకుతింటారు. ఇంక జీవితంలో సుఖమనేదిలేక మొగుడుజీవానికి, అల్లాంటి వివాహంచేసిన తలిదండ్రుల జీవా లకీపడి యేడుస్తూ ఇంటి చాకిరీఅంతా చెయ్యాలి. ఒక్కపూట తలనొప్పివచ్చి పడుకుంటే మాఅత్తగారు 'ఏమే, మడిబట్టలు నీరంకు మొగుడు ఆరవేస్తాడా, అంటుంది. ఏంచెప్పను బాల్య వివాహాలవల్లనే యీవితంతువులు వృద్ధిఅయ్యారు. ఇవి ఎందు కువచ్చిన నియమాలో వల్లకాటెనియమాలు. మొగుడుచస్తే తలవెంట్రుకలు తీయించాలనీ, ఇంటిచాకిరీఅంతా చేయించా లనీని, పైగా కళ్లుపెటుక్కున పేలిపోయేటట్లు నాలాటి బాల విధవల యెదటే గింగిలిన అప్పలూ, వదినలూ భర్తలతో సరాగాలూ సల్లాపాలూను తెలుచుకుంటే ఒళ్ళంతా ఆపాద మస్తకమూ తగలడిపోతుంది. ఎవరైనా సంఘసంస్కర్తలు వితంతు వివాహంఅనేది తలపెడితే ఆయన్ని వెలేసి, ఆయన్ని చంపినంతపనిచేసి, తాము చచ్చినంత హడావిడిచేస్తారు! శార

దాబిల్లు ప్యాసయిందనగానే ఆశాందాగారికి మరణహోమా లు చేశారుటకొందరు, పైగా పూర్వం సహగమనాలట. భర్తచస్తే బ్రతికిఉన్న భార్య నిండుప్రాణంతో భర్తతో తగు లాడలట. పంచలోమోకాని, ఆయనపేరు చెప్పుకోవాలి ఎవరు చెప్మా రామ్మోహనరావుగారంట, కలకత్తాలో ఉండేవాట్ట. ఆ సహగమనం లేకుండా చేసి ది అపుణ్యాత్ముడట. (నవ్వు. రామమోహనరాయలమ్మా అని ఒకరు) ఏమో ఆ ఇంగ్లీషు పేర్లు నాకు తెలవవు. చాలామంది బయలుదేరి వితంతువులకి పెం డ్లిండ్లు చేస్తున్నారు. మీలాటివాళ్ళకి వివాహాలుచేసి పుణ్యం కట్టుకోమని యీసభలోని సభ్యులని ప్రార్థిస్తున్నాను. విధవ ముండచేసిన పాపం యేమీ లేదు. ఇష్టముంటే పెండ్లి చేసుకో వడానికి అభ్యంతరం లేకుండా చెయ్యండి. తలిదండ్రులఆజ్ఞ యీవిషయంలో వినగూడదు. వితంతూద్వాహాలవల్ల సంఘం బాగుపడుతుంది. ఈ వివాహాలు లేకపోయినంతమాత్రాన, యీపూర్వాచారపరాయణులు తలచినది జరుగుతున్నదా? వితంతువు వికృతంగా ఉండడానికి కదా యీతలగొరిగింపు. తలలు బోడివైతే తలపులు బోడివవుతాయా? కోరికలు గోదా వరిలో కలుస్తాయా? ఆశలు అడుగంటుతాయా? ఏదీ అగదు. విధవా వివాహాలు చేయడంవల్ల వితంతువులు సుఖిస్తారు. ఇంక నేను కూర్చుంటాను నాతప్పులన్నీ ఒప్పులుగా భావించా లని కోరుతున్నాను. (చప్పట్లు కూర్చుండును)

అద్వైతమ్మ—(లేచి) అగ్రసనాధిపురాలుగారూ, నాకూ డా సెలవి య్యండి. నాఅభిప్రాయాలుకూడా ముచ్చటిస్తానుకొంచెం.

సుంద—టైము ఆట్టేలేదు. మీటింగు డిస్పర్సుచేసి వెళ్లాలి. ఆరుగంట లకి వై. డబ్లుయు సి. ఏ. (Young Women's Christian Association) కి వెళ్లాలి. అక్కడనేను ఓపెనింగు స్పీకర్ని (Opening-Speaker) ఒక్కనిమిషం మీకు టైము ఇస్తున్నాను.

అద్వైతమ్మ—ఆమాత్రంచాల్లెండి మీకు కోపంవచ్చినాసరే నాఉద్దే శాలివి. ఆడదానికి స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం ఉండాలంటారు గదా, ఎందుకో చెప్పాండి వల్లకాటి స్వాతంత్ర్యం ఇప్పుడేంతక్కు వచ్చింది ? అయినా పూర్వం వాళ్లిలాచేశారా ? సీత దమ యంతి మున్నగు పతివ్రతలు ఇలా వాదించారా పూర్వం ఉండే కట్టుబాటులు, పద్ధతులు ఇప్పుడున్నవా ? పూర్వంలేనివి ఎన్ని బలిశాయి ఇప్పటికాలపు ఆడవాళ్ళకి ? వీళ్ళుచేసే దార్జ న్యాల్లో ఒక్కదాన్నైనా నిరసిస్తున్నారా మగవాళ్ళు వాళ్లుఒక వేళవద్దంటే వీళ్ళుమానుతున్నారా? పక్కపాపిడులుదిద్దుకుంటే వద్దన్నారటండీ ? చంకల్లోకి ఎగిసిపోయేటట్లు రవికెలుకుట్టించు కొంటే భర్తలు వద్దనగలిగారండీ ? కాళ్ళకడియాలుతీసేసి, ముఖాన్నిబొట్టుకూడాలేకుండా కిరస్తానీవాళ్ళల్లా ఉంటూంటే వద్దనిచెప్పేరుటండీ ? భర్త పదిగంటలకి భోజనంచేసి వెడితే సాయంత్రం ఆరు, ఏడుగంటలవరకూ రాడుగదా ? ఈలోపున ఎన్నిపనులుచేసినా, ఎన్నిళ్లకు పెత్తనాలకువెళ్ళినా చూడ వచ్చారాంట ? అయితే మీ ఉద్దేశం ఏమిటి ? మొగుళ్ల ఎదు టనే మీచిత్తంవచ్చినట్లు చేద్దామనా ? లేక భర్తలనే అంట్లు తోమి, వంటచేసి మిమ్మల్ని షికార్లుచేసిరమ్మని పంపాలం టారా ? మీరు చదువుకుంటారా ? మీ భర్తలు మీకు వంటచెయ్యాలా ? పుస్తకాలు మీకూడా బడిపాకా మోసు కుపోనక్కర్లేదూ ? అయితే యింక ఆడజన్మమెందుకూ ?

మందిలుకట్టుకొని కోట్లుతో మనుష్యుని నమనండి పైగామరో విషయం వితంతువు కి పెళ్ళిళ్ళా? ఎంత తెగించారు? ఇంక కులం, శీలం అక్కర్లేదే ముగుడుచచ్చాక, ఆమొగుడిమెడలఖాదే విశ్వాసం కనబరచడంకోసం ఒతలవెంట్రుకలు తీయించుకోమనీ ఓసైనుపంచికట్టుకుని పెద్దలు చెప్తారు. కృష్ణా రామా అంటూ పారమార్థికంగా కాలంగడపమన్నారు. అంతేగాని వస్తుండమన లేదు భర్తపోయాక భార్యబ్రతుకు అడవిగాచిన వెన్నెలకనక మందిరిపట్టెమంచాలూ, సోఫాలూ యెక్కవద్దన్నారు. అయితే భర్తచనిపోతే ఇంకొకణ్ణి వివాహంచేసుకుంటారూ? వాడూ చస్తేమరొకడా? ఇలా ఎన్నివివాహాలు? ఎన్నిమారు మనువులు? చాలుచాల్లెండి మీటింగులుష మీటింగులాని ఎవడైనా నవ్వుతాడు యీ ఉపన్యాసలువిని.

అందఱూ—ఆగండి. అద్వైతమ్మగారూ అంతటితో మీ ప్రచండవాగ్ధోరణికట్టిపెట్టి వెనక్కుతగ్గండి. మీమాటలు మేము వినము.

అద్వై—వినకపోతే వినకండమ్మా అంతేనా,

సుందరమ్మ—చాలు. మీరందరూ నామాటవినాలి సైలెన్సుప్లీజ్ అద్వైతమ్మగారి వాదంచాలా అసందర్భంగావుంది. ప్రస్తుతం స్త్రీలకుకావలసినది అప్టుడేట్ ఫ్యాషన్ (Up to date fashion) మనంచాలాకాలం ఓర్పుతో అనుభవించాం మనభర్తల దౌర్జన్యం ఇంక ఆగవలసిన అవసరంలేదు. మీరు రేపే స్వాతంత్ర్యధ్వజంపాతిపెట్టండి. నడుములు కట్టండి లెండి. స్వాతంత్ర్యదుందుభిమ్రోగించండి. మనం మగవాళ్ళని లెక్కచేయగూడదు. వాళ్ళు ఏపనిచెయ్యమన్నా చెయ్యగూడదు. ఇదివరకులా

గున మీరు మీరు అని సంబోధించకండి. నువ్వుఅంటే నువ్వు అనండి. తెలిసిందా? ఇష్టో మీమట్టుకు వాడుకొని తినండి. కావలిస్తే వాళ్ళని వాడుకోమనండి. స్వాతంత్ర్యమునకు సూచనగా వీరకంకణాలు ధరించండి. ఇది త్రేపే జరగాలి ఇదివరకులా వస్తేలేచినిలబడకండి. కాళ్ళకడుక్కోవడానికి నీళ్ళివ్వకండి ఒకటేమిటి? ఏమీచెయ్యకండి. ఏంజరుగుతుందోచూద్దాం. (హియుక్ హియుక్ అని కేకలు) ఇంక మనకి వంటవేళ అయింది అందుచేత సమావేశం చాలిద్దాం రండి. దైవప్రార్థన ప్రారంభించండి.

(దైవప్రార్థనచేసి నిష్క్రమింతురు.)



# రా మ దా సు నా ట క ము.

గ్రంథకర్త:—బళ్లారి ధర్మవరం గోపాలాచార్యులుగారు.

ఆధునికకాలమునందలి యాంధ్రనాటక సమాజములవారి కంఠకును ముంగొంగుబంగారమైయున్న రామదాసునాటకమును, అందలి మాధుర్యరసపూరిత కీర్తనలను, మెరుంగనివారుండరు మన భాషలో నెన్ని రామదాసునాటకములు రచింపబడినను రంగస్థలమున ప్రదర్శింపబడున దిదియొక్కటియే! ఈనాటకప్రాశస్త్యమును మాటలతో వర్ణింపబూనుట సూర్యుని దీపికతో జూడదలంచుటయే !

వెల రు 1—0—0.

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణబుక్ డిపో రాజమండ్రి.



శుభమస్తు.

# సతీసక్కుబాయి

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

[సక్కుబాయి ప్రవేశము.]

సక్కు—ఏమినాయనా! యశోదానందనా! నీవెల్లప్పుడు చిరునగవుతో నాయొనరించు పరిచర్య నాదరింతువుకదా? నీకేమి బహుమానమిత్తును? నీ కెమ్మోవి సంశోభితము జేతును. యశోదాకోమలకరపల్లవంబులచే లాలితములగు నీసుకుమారతనువు రాసి నాకఱకు హస్తములచే గొట్టుదునా !

శా. రావోయీ! యదునందనా! పృథుజగద్రక్షా! యశోదాసుతా!
దేవా! నీసుకుమారదేహము హస్తీభూత మత్యద్భుతం
బీ విశ్వాసిని పాపహస్తములతో నేమానోయుంచెంచకో
యీ! విశ్వేశ! నన్నుదయన్ కనగదోయీ! పాండురంగప్రభూ !!

అసంఖ్యాకగోపీజనగృహాంగణవిహారయోగ్యంబులగు నీపదరాజీవంబులు స్మరణమాత్ర సర్వపాపారణ్యదావానలంబులగు నీ చరణకమలంబులు—శతకోటిభక్తజనహృత్తటీతటిచ్ఛలితంబులగు నీమృదుచరణద్వంద్వము సదా నాకఠినకరస్పర్శనంబున

కుడుచుచుంటివేవా? సతతభక్తజనహృత్తరంగముల నుయ్యాల లూగు నీకరుణామయ మూర్తి—చతుర్దశభువనపరిపాలనా దక్షంబగు నీయుదయమూర్తి గోపాలా! షోడశసహస్రగోపకాంతామణీపీనోన్నతస్తనహారసౌభాగ్యంబగు నీమనోహరమూర్తి—కూనిజనక్రీడామధుసుమమాలికాలంకృతంబగు నీశ్యామలమూర్తి నీప్రీతిపాత్రుఁడు బ్రతిక్రతువొనర్చినందులకైన నాయందు కిని యొక మందహాసములో కృపాంచితవీక్షణ ప్రసారమున మోద మొదవింతువా?

సీ. చంద్రికాసుధాపోత స్వచ్ఛమౌ నీదయ
నాపై నొకింతఁ గన్పుపుమయ్యా!
తేటతేనియకంటెఁ దీయనౌ నీపల్కు
వీనులకింత విన్పింపుమయ్యా!
పరమపావన! నీకృపావీక్షణముల
జల్లున నాపయిఁ జల్లుమయ్యా!
అతిలోక రమణీయమైన నీదర్శనం
బిపుడైన నాకుఁ జూపింపుమయ్యా!
నాన్యతో దర్శనీయముల్ నవ్యపుష్ప
రాగరేఖా పరిపూర్ణముల్ ప్రథితవర్ణ
రంజితమ్ములునైన నీరమ్యహాస
జలము నామీద నొకయింత జల్లుమయ్యా!

నీదయాసుధకంటె ధవళమై—శరచ్చంద్రికా ప్రసారముకంటె శీతలమై-దివ్యఫలరసంబులకంటె మధురమై నాయెడల వెల్లివిరియుచుండుటవల్ల నే నేనీ మాయాసంసారాంధకారమున నీ మంగళమూర్తిని గుర్తించుచున్నాను! సర్వతోముఖవ్యాప్తమగు! నీసర్వజ్ఞమూర్తిని నాకీ చతుర్థంగుళీపరిమాణ్యుదారు ప్రతిమ

యందు గోచరింపఁజేసి జన్మసార్థకత నొందించుచున్నావుగదా నీలేనగవులు—నీగారాములు—నీకృత్రిమావతార క్రియా విశేషంబులు ఎంతవర్ణించినను కొన్ని జన్మలు జీవించి స్తవముఁ జేసినను అంతమగునా? నేనేమి యుపహారము లొసంగితిని—ఏమి మంగళధ్వనులతో నిన్ను భజించితిని? నిన్ను మంగళ స్నాన మొసరించుటకు నాయొద్ద నేమి సుగంధ జలములున్నవి నిన్నలంకరించుటకు నాకడ నేమి పీతాంబరములున్నవి—నిన్ను తృప్తిపఱచుటకు నాయింట నేమి దివ్యాన్నములున్నవి? అయ్యో! చిన్నకృష్ణా నాయనా నీతో నాడుకొనుటకు గోపాలుర నెచట దెత్తును? తండ్రి! వేయేల గుక్కెఁడు శుద్ధజలమునకైనను—పట్టెఁడు వేఁడి యన్నమునకైనను నీకొసంగుటకు నోచుకొనలేదే! పాపము! అత్తగారు నాకొసంగిన పాచియన్నమును — భర్తయొసఁగెడు నెంగిలి జలంబును నాతోఁ బాటుఁ గుడుచుచుఁ ద్రావుచు కాలముఁ బుచ్చుచుంటివా! నీఋణమెన్ని వేల జన్మంబులకుఁ దీర్చుకొందును! వనమాలీ! నేను శబరియంతటి పుణ్యాత్మురాలనా! గుహునంతటి భక్తశిఖామణినా? కుచేలునంతటి పరమమిత్రమునా! నాయందు నీకింత యభిమానమా! బాబూ! నీహాసము—నీధ్యానము నేనెన్ని యిడుమల గుడుచుచున్నను—ఎన్ని భంగపాటులు నాజీవితాంతరమున సంభవించినను మఱువను! మఱువను! ఇదిగో! నీచిన్నియడుగుందమ్ములనంటి చెప్పుచున్నాను! నీవే నాతండ్రివి—తల్లివి! నాసర్వస్వము సర్వదా నాకు భర్తృపదారవిందసేవ నొకవైపున—పరమనిర్గుణ తత్త్వావతారభజన మొకవైపున హృదయదుర్గాంతరమున డిండిమనాదమొనర్చు నట్లను గ్రహింపుము—విమలాంతరంగా! అఘభంగా—పాండురంగా!

నిన్ను భజించుకొలంది నాకీలోకముకల్లగాను—సంసారము—మిథ్య గాను దోచును. కృష్ణా నన్ను పెడకుమా! నాజీవితప్రభ నీలోనైక్యముఁ జేసుకొనుము. నీనుండినన్ను వేఱుపఱుపకు

(అని బొమ్మను ముద్దు పెట్టుకొనును.)

అనుబంధము 4

(అత్తగారు ప్రవేశించును.)

అత్త—ఒరే! విశ్వం! దీనితల్లికడుపుకాల! నిజంగాదీనికిపిచ్చెత్తిపోతోందిరా బాబూ! ఎన్నివిధముల ఆబొమ్మతో అడవొద్దే తల్లీ అని మొరపెట్టుకుంటున్నా వింటంలేదు. దీనికి తగినట్లు రోగం కుదురుస్తానుండు! మనకిదెక్కడి దొరికిందిరా! కోరికోరి కొఱకంచు తెచ్చిపెట్టుకున్నాము? పోని ఏదైనా రోగమేమో కంసాలి శరభయ్యని పిలిచి యింత విభూతి పెట్టించు లేకపోతే వెట్టిపుల్లాయి తోలుముక్కిస్తాడు తెచ్చి మెళ్లోబిగించు! ఆచార్లుగారిని పిలిచి యింత సన్నిపాతం అయినా మింగించు! అప్పటికీ కుదరకపోతే నాకు మా యత్తగారు బోధించినమార్గాలు గోసాయి చిటికెల్లాంటివున్నాయి! చల్లగా ప్రయోగిస్తా! కాని అన్నిమాటలు తిట్టినా మొఖంమీద కాండ్రించి ఉమ్మేసినా తుడుచుకుపోతుంది! అదేం శాంతమురా! దీనితల్లికడుపుకాలా కొడితే ఏడవదు! పోని యిల్లా బాధపెడుతున్నాము అని విసుక్కొని పనియేమైనా బద్ధకిస్తుందాంటే పిశాచంలా చేస్తోంది! నాకసితీరేట్టు ఆబొమ్మని గోతులో గజాన్నరలోతున పాతేసి యిటుకలతో పూడుస్తా: దిక్కుమాలినబొమ్మ యీ ముద్దమ్మ

కు ఏలా అడ్డమాతుందో! పద! నువ్వుగొయ్యితీయిరా చూ
స్తావేం! వెర్రినాయనా! నీకెల్లాంటి మతాబా దొటికిందిరా
ఏదే ముండా! ఆబొమ్మఏదీ!

(అని రెండుచేతులుచాచి బొమ్మ లాగుకొనును.)

విశ్వే—అమ్మా! బొమ్మలాక్కుంటే అల్లాకొయ్యబొమ్మలా చూస్తుం
దేమే! పిచ్చికాదే దీనికి దెయ్యంపట్టింది! అసలు నువ్వే అను
కుంటే సీతాతలాఉంది దీనిపట్టుదల! ఏమేభవానీ! మాఅమ్మ
అన్ని విధములా చెప్తున్నా నీకింకా బుద్ధిరాలేదూ! దానికొస్తే
కోపం తెప్పించకే వెర్రిముండా ఒళ్ళంతాకాల్చివాతలెడుతుంది!
దానికోపం సముద్రంలా పొంగొస్తుంది. చల్లార్చడానికి నీఅబ్బ
తరంగాదు! మాట్లాడితే నాబుర్రచెక్కలు చేస్తుంది! తెలుసా!
యిప్పుడైనా ఆబొమ్మను మరచిపో! ఏంపోతావా! మరచిపో!

(అని కొట్టును కొట్టి లోనికి పోవును.)

కృష్ణుడు, రుక్మిణి ప్రవేశింతురు.

రుక్మిణి—నాథా! ఏమిచిత్రము! అజ్ఞానాంధకారమునం దెన్నంగానక
తొట్రుపడుచున్న యీమాతాపుత్రిలకాబొమ్మ ఏమి
యుపకృతి నొనర్చినది? సర్వకాలములందు మిమ్మేనమ్మిధ్యా
నించు నాసాధ్వీకించుకైనను శాంతిలేదుకదా! అమృతము
ప్రాణప్రదమైనను మృతికింగూడ కారణభూతమన్నట్లు మీనా
మము భిన్నరుచులం బ్రసిద్ధమగుచున్నది! పాపమామెకింక
నెంతకాల మీబాధ?

కృష్ణుడు—గీ. ఈజగన్నాటకరంగమందేను సూత్ర
ధారుడను భిన్నభిన్న సందర్భములను
ప్రాణికోటి కూహాతీతమైన వేష
ముల ధరించెద నవతారములనుదాల్చి.

సతీ ! మ తేమనుకొంటివి ? ఇది జగన్నాటకరంగము ' నేను సూత్రధారుఁడను. యావత్ప్రాణికోటియు నీరంగమున భిన్నరూపములఁ దాల్చి చిత్రవిచిత్రనటనములనొనర్చి తుదకు కాలమృత్యువను యవనికాంతరమున లీనమగుచున్నారు ! నేను చిత్రప్రతిమను! నన్నారాధించువారి మనోనేత్రములకుఁ దాఁగొనిన తెలుఁగున దర్శనమొసఁగుచు వారి యభీప్సిత ములఁ దీర్చెదను. సక్కుబాయి పరమసాధ్వి ఆమెను మూఢులగు వీరెన్నిభంగుల బాధించినను, శ్రీవణకాశి శ్రమగ నేమి దూషించినను నీమనోమాత్రమును కుకొంకులు లేక, విసుఁగు లేక, భరించును. అదినాశక్తి ఆమె నాకుప్రియమగు భక్తురాలు ! వారు చేయు చర్యలింకను చూచుచుందుము !

సక్కు—(కొయ్యబారినట్లయి బొమ్మ పోయినవైపుచూచుచు)

శా. రమ్మోయీ! యదుభూషణా! మృదులగాత్రముజ్వలన్నీలవ
ర్ణమ్మొల్ సొంపులు దేరశీర్షమున పింఛమ్ముల్లలాడ గ వ
శమ్మౌ మోహనగీతికారవళిఎర్ల స్ఫూర్తి రాలఁ బ్రభా
తమ్మున్ జేయుము నాదుకన్నులకు నిత్యజ్ఞానసంధాయకా.

పోవుచుంటివా కృష్ణా ! కాదు కాదు నన్నాడించుచున్నావా ! నేను నీకేమియు బాధకలిగింపను. నన్ను వీడిపోకుము . దయా సముద్రా! నీరూపమెన్నిభంగుల నుత్తమజనశ్లాఘ్యమైనను నాకెల్లప్పుడు చిన్నిగోపాలుఁడవే ! బ్రహ్మాండలోకములనెల్ల కుక్షిలో నిముడ్చుకొని ఏమియు నెఱుఁగని యమాయకునివలె నటించినను నీటక్కులు నాయొద్దజూపకుము రమ్ము! కర్ణపేయముగ మురళిమ్రోయించుము ! రాగతాళములు రంజిలునట్లు తాండవమాడుము ! అఁ ! దవుదవ్వులకు పోవుచుంటివి ! నేను రాజాలననియా? నాయత్తకోపగించుననియా ! ఆమె

యుత్తమురాలు! నీమాయాప్రభావముకాదని ఆమెకా దారు ణలీలాక్లేశప్రదమగుటకును నాకు మోదప్రదమగుటకును హేతువేమి! శ్యామలాంగా! సుకుసుందరాననారవిందచిక్కణా కైమెఱుగులీను ఆగండఫలము, కస్తురీతిలకాంచితమైన రమ ణీయ ముఖారవిందము ఒకటనగల! ఆపెన్నైలు లావిశాల ఫాలతలంబు, అవికచారవింద నేత్రద్వంద్వము అసుప్రాణిముత్తి యముల పల్వరుస — ఆచిర్నగవు— అబలిసినకంఠము—ఆదార్ఢ్య భుజాదండము—అవిశాలవక్షోవీధి!—ఆహా! ఆయాజానులంచిత బాహుద్వయము—భక్తాభయప్రదానయోగ్యంబులగు నాహ స్తపద్మములు జగన్నాథా!......పో—కు—ము.

(అని పడిపోవును. శ్రీకృష్ణ—రుక్మిణులు సక్కుబాయి చెంతనుండి నడచిపోవుదురు. ఆమెకు ప్రత్యక్ష పరమాత్మదర్శనము.)

(సక్కుబాయి మేల్కొని) ఆ! ఆ! ఏమిదివ్యప్రభ! ఏమి దివ్యసుగంధము! పాండురంగా! మఱియొక్క త్రుటికాలమాగుము! కన్నో యి నీ నీలమేఘశ్యామలాంకారము దనివితీఱ జూడనిమ్ము! ఏమిచిత్రము నామనోకాయములు గాలిబెండువలె తేలికవై పరమాత్ముని వెన్నంటిపోవుచున్నవి! తటిల్లతచాయ్సున—అగ్ని విస్ఫులింగక్షణప్రభమాడ్కి—నాకలోక సువర్ణకుసుమ సౌర భంబు తెన్నున—భూనభోంతరాళ పరివ్యాప్త బహ్మాండరూపం బువిధంబున—అగాధసూక్ష్మమై, ఒక్క క్షణములో నన్ను మో సపుచ్చుచుంటివా? రత్నాకరంబు చెన్నున—స్థూలమై,

సీ. పారిజాతలతాంత భాసురమ్మైన యీ
కమనీయ దివ్యసుగంధమేమి?
శతసహస్ర రవిప్రకాశస్త కాంతిస్ఫురల్
ప్రభవితమ్మైన యీ ప్రభయిదేమి?

అతిలోక రామణీయక సుధావరిపూరి
తంబైన యీమారుతంబదేమి?
ఘనఘనాఘనస్నైల్యాతరు రాగసంచలతో
కళమైన యీ దివ్యాకతియిదేమి?
గీ. అఖిలమునునిండి యఖిలమునందు వెలిగి
యఖిలమును పెంచి యఖిలమ్మునను భవించి
యఖిలరూపాద్భుతుంబైన యాది విరళ
దేవ్రుడాయేమొ! నాపుణ్యసేవయేమి?

అనుబంధము 5

(అత్తగారు, విశ్వేశం ప్రవేశింతురు.)

అత్తగారు—ఒరే! అబ్బాయీ! ఇంకా చూస్తావేమిరా! దీనిరోగం నేను కుదురుస్తా, మందూ మాకూవల్ల దీనితెగులు చల్లారదు! తే! ఆ పొయ్యిలో ఎర్రగా కాలేశానే అగరిబె యిట్లాపట్రా! నాలుగు వాతలు పెడితే దీనిజ్వరం నిమ్మళిస్తుంది! పెంకె ముండా!

విశ్వం—(తనలో) సోసి! ఏదో దేవ్రుణ్ణో దేవతనో కొలుచుకుంటూ యింట్లోపడియుండవే నిర్భాగ్యురాలా అంటే వీధిలోబైరాగాడు కనపడ్డం భయం-హరిదాసుణ్ణి చూడ్డంభయం గబగబా పరుగెత్తి వాడి కాళ్లట్టుకొని నాళ్ళనమ్మ్మనెత్తిమీద చల్లుకొంటుంది! దీనిభక్తి మండా! లోపలనాకుదీన్నిచూస్తే తగనిప్రేమ! ఎంచేతా అంటే అది ప్రపంచస్వభావం! ఎవళ్ళ భార్యనివాడు అసహ్యహించుకొంటాడా? మా అమ్మమీదఉండే మాతృ భక్తివల్ల ఏమీ అనలేకుండాఉన్నాను. ఆఖరికి గరిటెకాలేసి వాతలుపెడతానంటోంది. దీనిమాట వజ్రాయుధం! ఇఖ దాని కడ్డులేదు! ఏంచెయ్యను? ఎవడేనా దేముడంటూంటే వాడ్డే కాపాడతాడు,

రుక్మిణి—ప్రభూ! అదేమిటి? వారు ఎర్రగకాలిన పరికరణమేదో తెచ్చుచున్నారు. ఇంకను చూచెదరేల? పాపము సక్కుబాయికి దానిమూలమున భరింపరాని బాధ కలిగింతురు కాంబోలు! దయయుంచి మీరు త్వరపడుడు!

కృష్ణుడు—

గీ. ఎల్లయీలీల వచియింతు తేలవగుచు
తెలియరాని భక్తమహాత్మ్య దివ్యశక్తు
లప్రమానసకోటికి అఖిలలోక
పాలనాదక్షమగు నాదు ప్రతిభగాక.

ప్రియా! నీ కాపూజ్యురాలిపైఁగల ప్రేమాతిశయంబున నట్లు వేఁగిరపడుచున్నావుగాని నేను నాకృపాభావమున సర్వము గ్రహించియు నిట్లూరకొనుటకు కతమెఱుఁగఁజాలకుంటివి! వారేమి చేయుదురో చూచుచు నూరకుండుము! ఏమియు సందడి చేయవలదు!

అత్త—ఓసేరే యిదిగో బట్టతో పట్టుకొని జాగ్రత్తగా పట్టుకురా! కదలకుండా ఆ మొండిముండని తాడుతో కట్టెయ్యి! ఎప్పుడూ యిల్లాంటిపని చేయకుండా యీరోజుతో దీనికి బుద్ధొస్తుంది!

విశ్వే—అమ్మా! (వణకుచు) చాలాసాహసిస్తున్నావే! ఊరికే గమ్మత్తు చేస్తున్నాననుకొంటున్నాను! నిజంగా కాలుస్తావా ఏమిటి? మనం యిద్దరుపోతేమా దీన్ని యిల్లా బాధపెడితే దీనికి దిక్కెవ్వరే!

అత్త—అయ్యో వెఱ్ఱిపీనుగా! యిల్లారా! నాకుమాత్రంయీగుంటనిచూస్తే కోపంటావ్రి! మనం రోగం కుదిర్చలేక ఏదో వెర్రిప్రయత్నాలు చేస్తున్నాము! (కండ్లలో నీళ్ళుకారును) చూడు! రాత్రి నాకు కలలో మీనాయన అయ్యో! ఏనాడోపోయిన మహానుభావుడు! కనపడి నిర్భాగ్యురాలా కోడలికి ఏమీరోగంలేదు

అదంతా నామహిమ! నేను కీళ్ళనొప్పులతో బాధపడి చచ్చానుకాదూ! నాకు వాతలు పెడితే ఆబాధపోతుందని కోరిక ఉండగానే చెప్పలేక చచ్చిపోయాను. అందుచేత ఆకోరిక తీరడానికి మార్గం చెప్తాను. దీన్నిపట్టుకొని పిస్తున్నా వెంటనే దీసి నాలుగు వాతలుపెట్టు! నా కోరిక తీరిపోతుంది! దీనివల్ల మీకు ఏమీబాధ ఉండదు అని చెప్పి అంతర్ధానం అయ్యేడు! కనుకా ఆయన కోరిక తీర్చాలి! అట్లాచేయక పోతే పితృద్రోహం నీకూ భర్తృద్రోహం నాకు సంభవిస్తుంది! తెలిసిందా!

విశ్వే—అమ్మా! అదా! దీన్లో రహస్యం! అట్లా అయితే మరిరెండు వాతలుపెట్టు! నాన్నకు తృప్తి అయ్యేటట్టు! ఏమేఁ! ముండా నీరోగం కుదురుతుంది! నీబొమ్మ బొమ్మలాట వాదుంటుంది చెప్పినట్లు వింటావా! వినవా! ఊఁ! ఊఁ! (అని గట్టిగా గుంజుచు తాటితో కట్టును. అత్త ఎర్రని గరిటతో శరీరము మీఁద వాతలుపెట్టును. (విశ్వేశం కంపించి భయపడి కండ్లు మూసికొనును.)

(సక్కుబాయి కృష్ణా కృష్ణా అని పడిపోవును)

రుక్మిణి—అబ్బా! ఇట్టి మహాఘోరతమకృత్యము జూపించుటకా నన్ను దోడ్కొనివచ్చితిరి! ఆయిల్లాలు కఠినాత్మురాలై మీభక్తురాలిని భరింపరాని బాధల పాలొనరించుచుండ చూచుచు నూరకుండెదరా! చాలు లెండు! మీభక్తజనపరిపాలన!

కృష్ణ—ఇంకను జరుగు చిత్రములు గమనించుము. ఇది కిన్నెరనాద స్రవంతులఁదేలియాడుటకాదు! అమితలలితచ్చరాంగనాకేళీ దృశ్యముకాదు! సఖీజనార్పితకుసుమవర్షముకాదు! మద్భక్తజనహృదయపరిశోధన! కాంచనమునకు లోహముష్టితాడన

మట్లు నాభక్తుల కిట్లే దుస్సహదారిద్ర్యపరితాపములు సంభ
లితములు! తుదకు వారి మనోనైర్మల్యఫలసిద్ధికి మోక్షము
సాన్నిధ్యమగును. చూడుము! ఇంక జరుగు విచిత్రముం జూడుము!

సఖ్య—

ఉ. ఈతపితాగ్నియోగమున నేటికి నాయొడలెల్ల చంద్రికా
శీతలమై సుధార్ద్రమధుశీకరసంజనితప్రసన్నసౌ
ఖ్యాతిశయోర్మి డోలికలయందు చరించెడునట్టులయ్యె హా ప్రి
భాతవిశుద్ధహైమకణవర్షము నాపయిఁ జల్లుచుంటివో.

కృష్ణా! యదుకులభూషణా! అగ్నిపరితప్తాయోకాష్ఠమున నాయొడ
లు భగ్గుభగ్గున మండుటకు మాఱు నవజీవనోత్పాదకమై హిమ
శీతలమై—సుధామయము జేయుచున్నది. ఆహా! మందహాస
ముతో నను వీక్షించుచున్నావా? నాయనా! నీదయ!!

రుక్మిణి—దేవా! ఎంతటి నిష్కల్మషచిత్త చూడఁదగనివి కాని దృశ్యము-
వినరాని పరిభాషలు ఒకవైపున పూలమాలలు మఱియొక
వైపున శరపరంపర నీపైకి రివ్వురివ్వున విసరుచున్నారు! ఆమ
హాసాధ్వి మనోవీధి నిర్మలమై—ప్రశాంతమై—అసంఖ్యాక స్తవ
తారకానికప్రభా జేగీయ మానమగుచున్నది. ఆమూఢుల
హృదయాకాశము మహాకిల్బిషాంబుధరావృతమై భగవత్సైం
కర్య దూషణాంధః పరిచ్ఛదమై భిన్నప్రకృతీవిలసనమున తాండ
వించుచున్నది! దీనికి నీవే మూలకారణము.

అత్త—అయ్యో! నీమొహమీఁడ్చ వాతలెట్టినా మళ్ళీచిలకల్లాకూర్చుని
కేల్తున్నావులే? ఈసారి నోటిమీఁదపెడతా! నీమంపతెగా!
ఉండు! విశ్వం! ఇంకాకొంచెంరోగం శేషించిందిరా! గరిటె
మళ్ళీ కటాది! తొందఱగా!

విశ్వం—అల్లాగా! వస్తున్నా! బాగా కాచ్చి తెస్తా (అని గరిటె తెచ్చును తనలో) ఇందాకా కాలుస్తుంటూనే నా ఒళ్ళు భగ్గు భగ్గుమంది యీసారి యీ యమయాతనచూస్తే నాఒళ్ళే కాలేటట్టుంది! రామ రామ! (ప్రకాశముగా)ఇదిగో! తెచ్చా! (అనిఅందిచ్చును)

అత్త—ఎంత తంటాలు పడేనాసరే నామొగుడి కోరిక తీరుస్తా. యీ పాటు ఆయనకు తృప్తిఅవుతుంది! (అని నోటిమీద కాల్చును. విశ్వేశం ప్రక్కను నిలుచుండి విచారంతో చూచుచుండును)

విశ్వే—బాబోయ్! అమ్మోయ్! చచ్చానే! న్ను చంపేశావే! అయ్యయ్యో! దానికాల్చబోయి నన్ను కాల్చావే! అయ్యో! అయ్యో!

(అని పడిపోవును.)

అత్త—ఏమిటిరా! నాయనా! అయ్యో! కొడుకా! నిన్నేమిచేయులేదురా! యిదేమిచిత్రమురా బాబూ! అల్లానిలువునాపడియున్నావేమిరా! ఈదరిద్రప్పీనుగ చేరాక యింకా ఏంజరుగుతుందోరా దేవుడా! నేనూ యీ భిక్షువళ్ళు కాపురం చేశాకాని యిల్లూ మొగుణ్ణి మట్టిలో కలిపే యత్నం చేయలేదే తల్లీ! ఏనాడు మాంగుమ్మములో కాలెట్టిందో మహామారీ ఓమాటూబుద్ధికిశాంతం లేదు. యింట్లోగోల—వీధిలోగోల—అయ్యో! అయ్యో! ఎంత మాయముండవే! నువ్వెందుకు బతికేవే!

(సక్కుబాయి లేచును.)

సక్కు—ఆ! ఇదేమి! అత్తగారూ ఏల నాధుజెట్టి మీదు దుర పిల్లుచున్నారు? (అని సమీపించి) నాధా ప్రభూ! నిద్రించుచున్నారా లెండు! అకాలమున నీగాఢనిద్రయేమి? చూడుడు! అత్తగారు బెంగవడుచున్నారు! పాపము!

(అని పాదములంటును.)

విశ్వేశం—(లేచి) అబ్బ దీనిసిగతఃగ! అమ్మా నిద్ర ఎంతహాయిగా ఉంయిందే? ఏమిటీ నంచుకమట్టుగానే నిద్రవొచ్చింది? కాని అమ్మా! దీన్నిను వ్వాలాగ కాల్చకూడదే!

అత్త—అయ్యో! నీవు శుద్ధపెద్దన్మవురా! అందుచేతే యీమాయలాడి మాదులు మంత్రాలువేసి మన్ని ఆడిస్తోంది! నువ్వు కూడా నాకుమల్లె జాగ్రత్తగా ఉంటే దీనిపస కనిపెడుదుము!

(శివనాథయోగి ప్రవేశించును.)

అనుబంధము 6

శ్లో. గేయంగీతా నామసహస్రం । ధ్యేయం శ్రీపతిరూపమజస్రం
సేయంసజ్జతి మనిశమ్దేయం । దీనజనాయచ విత్తం
॥భజగోవిందం॥

శివ—

సీ. కమలసన్నిభమైన కనులలో శ్రీరంగ
చరణాబ్జరేఖలు సిరులనీన
శ్రీకార నిభకర్ణ సీమలలో విష్ణు
సేవావిధానంబు చెన్నుమీఱ
లక్ష్మీనిధాన విలాస సంపత్తిలో
సకలదేవప్రభ వెలుగునింప
కల్యాణమయరూప కాంతుల పండరీ
పురనాథు ప్రైభవస్ఫూర్తినింద

గీ. నిఖలసౌభాగ్య సంపదంచితములైన
పలుకులఁ భక్తిభావంబు మొలకలెత్త
మూర్తిఁదాల్చిన భక్తియై పొలుపునింపు
నన్నుఁదర్శనమున జన్మసఫలమయ్యె.

ఆతల్లిదర్శనము తిరిగి నేడులభించును! ఒక్కొక్కతరుణమందు పాండు రంగడైన మఱపువచ్చునుగాని మహాసాధ్వి సక్కుబాయి నిద్రియందైనను మఱపురాదు! ఆమెయె సాక్షాద్విఠ్ఠలప్రభువు! ఆహా జగన్నాధుని లీలాప్రభావమున పాండురంగద్వేషులైన తల్లికొమరులొనరించు యమానుష శిక్షాపరంపరయందా యుత్తమరాలి యుత్తమాంగము కమిలిపోవుచున్నది! కాని యిందుకైన కలఁగని తల్లి—భక్తశిఖామణి—సద్గుణఖని అత్త కోపించునపుడాతల్లి చల్లనిచూపులందు— బాధించునపుడాయమ్మ పలుకు భాషణములఁదు ఔరా! వచించుట కలవికాని మధురతమమగు భావములు వెల్లివిఱియుచుండును. పండరికిఁ బోయి రంగని సేవించుటకంటె నీపరమపావని సాన్నిధ్యమున లభించు మోక్షమార్గోపకరణము లద్వితీయములు. కావున నిట్టి పవిత్రుల హృద్వ్యోవీధిని వెలుంగు దివ్యజ్ఞానేందుమూర్తి మహత్కల్యాణగుణ సాగరఘూర్ణితోద్భూత సంరంభమున కాధారభూతమై నావంటి పాంథులకమితాహ్లాదకరుండై సద్యో ముక్తిమార్గప్రదానంబగునని పూర్ణముగ విశ్వసించియే నేనీ తల్లిని దర్శింపఁ గుతూహల పడుచుంటిని. అదిగో! కంటక భూయిష్ట లతాంత నవవికసిత సురభిళ ప్రసూనమట్లు-దుస్సహ దుర్భాషాకంటక సమాసాదిత శాంతమూర్తియై యామంగళ స్వరూపిణి పతిసేవ నొనర్చుచున్నది. (అని పాడుకొనుచు వారి ని సమీపించును)

అనుబంధము 7

అత్త—అమ్మ గాడిదకొడకా! ఎంతపని చేశావురా! నాకొడుకుని చచ్చేటట్లుచేసి యీ మొండిపీనుగని కాల్చినా కాలకుండా చేసి సిగ్గులేకుండా మళ్ళీ యీవాడకెల్లావచ్చావు! నీ దుంప తెగ!

శివ—అమ్మా! అది అంతయు మాయ ఒకరి యాయుష్కాలాపహర ణపరిరక్షణము లొండొకరిచేత నున్నవనుకొనుట భ్రమ. మీరు చేయునదియు, నేను చేయునదియు ఒకటనే. పిపీలికా బ్రహ్మపర్యంతము సర్వప్రాణులు అరగని యవాఙ్మానసగోచరంబగు శక్తిప్రభావంబున సంచరించుచున్నవి! అహంభావమదోన్మత్తతచే మననగా దివ్యక్షేత్రము చేరజాలకుంటిమి. నేనజ్ఞానుండను. మీరొనరించు నిందకు నేను పాత్రుండనుగాను.

విశ్వే—అమ్మా! వీడిని మాట్లాడిస్తే ఒదిలిపెట్టడే! కండకీగలతుట్ట—బలుసుడొంక—దురదగొండి చెట్టున్ను వీడితల్లికడుపుకాల! ఎందుకు మళ్ళీ యిల్లాదయచేశావు నాయనా! నువ్వుపాతిన బీజము బాగానాటింది నీధర్మమా అంటూ ఎడతెగని ఏడుపుతో యిల్లాడున్నాము! అదీయిష్టములేకపోతే యింకాచేస్తావో చెయ్యి! యీ వీధికి రావొద్దురా బాబూ అంటే మానవుగా! అమ్మా నువ్వంటే యీ గ్రామ్లో దోమలు చీమలు కూడా హడలిపోతాయిగదా వీడికి ఎంతమాత్రము భయంలేదే!

అత్త—నిజంచెప్పావురానాయనా! వెయ్యేండ్లుబ్రతుకు! వీడికెంతమాత్రము భయంలేదు. వీణ్ణిమళ్ళీ యీప్రాంతానికి రాకుండా చేస్తాను. చూడు నామజాకా! (శివనాధయోగివైపుతిరిగి) అస్తమానూ అల్లాదేముడో దెయ్యమో అని ఏడవకపోతే ఏదో కురిగుంటని చూచుకొని ముండేసుకొని పిల్లామేకకలిగి బతక్కడదూ! రాయిలాడున్నావు యిదేం పోయేకాలం? ముసలాడవా ముక్కాడవా! ఇదంతా చూస్తే దొంగవేషంకాని నిజంగా నీకేమిభక్తి? ఇల్లాంటి వాళ్ళంతా భక్తులైతే దేవాలయమంతా సారా దుకాణం అయిపోదూ? పగలు ముష్టి, సాయంత్రం

సందకపశం రాత్రి బొక్కతవ్వడం నీవేషంలో ఉండే రహస్యం, యీసారి యిల్లొవొస్తే నిన్ను పోలీసువాళ్ళకి అప్పగించి ఘో శక్షలు విరగ్గొట్టిస్తానుండు. ఓరే విశ్వ ! ఇందాకామనం సక్కు బాయికి బహుమతియిచ్చే మే పొయ్యిలో ఉందిఎర్రటిది. యిల్లా పటా్రి! వీడికూడా కొంచెం రుచిమాపిస్తా!

విశ్వ—(ఎర్రనిగరిటెతో ప్రవేశము.)

శివనా—తల్లీ ! నీసంభావన మెంతయు శ్లాఘ్యమైనది! మహత్తరశేము షీ వైభవోచితయగు నా సక్కుబాయికిని నాకును సనుమగు బహూకృతినొనర్చి ధన్యురాలవు కమ్ము నీవు నిష్కపటు రాలవు !

అత్త—(కొడుకువద్దనుండి గరిటె తీసుకొని) ఓరివెర్రిబైరాగీ ! పండో ఫలమో అని చంకలు ఎగరేస్తున్నావు కాబోలు యిదేమిటో చూశావా! కణకణలాడే నిప్పులో ఎర్రగాకాలిన గరిటె! రెండు దెబ్బలు దీనితో తీసేసరికి ఆడిప్పకాయకు రోగం కుదిరినట్లుంది! నీకు అంతేగతి పట్టింది ! ఇప్పుడైనా యింక ఎప్పుడూ రానని కాళ్ళట్టుగుంటే వొదిలేస్తా! ఏమంటావ్?

శివనా—

గీ. భక్తిమతియైన యీ సక్కుబాయి పూత
కాయముఁ స్పృశించిన యయాంకాష్టమునను
నాయఘశరీరముఁ దహనంబొనర్చి
పావనీ ! పవిత్రము చేయవలయు నీవె.

ఆహా! నవశిరీషకుసుమ కోమలమగు సక్కుబాయి పూతతనువల్లిని స్పృశించిన యీ అగ్నిపరితప్తపవిత్రపరికరణంబు నాపాపశరీర మును తాకినచో శీతలమగునేమోయని శంకించుచున్నాను మాహృదయస్థిత యథార్థభక్తిభావములను పరిశీలించుట కవ

తరించిన భ్రిభుమూర్తివి! రమ్ము పాపసి! నీవే నాశరీరమం తయు రక్తధారలుఁ జిమ్మునట్లు గాల్పుము! నాకలుషరాసిని దహన మొనర్పుము — అలసింపకుము పుణ్యా అకళంకకరణము చల్లారును!

అత్త—నాకు నీమాటలు విన్నకొద్దీ ఒళ్ళు మండుకొస్తోంది. (గరిటెబు చ్చుకొని వాతలుఁ బెట్టును.)

తల్లి—అత్తగారూ! ఎంతటి దుష్కార్యమాచరించుచున్నారు! దయా మయుఁడగు పరమాత్ముఁడు సృష్టించిన జీవకోటిలో నుత్తమో త్తమమగు మానవజన్మమందలి సత్యమును గుర్తింపజాలక పూజ్యుఁడగు శివనాథయోగిపుంగవునట్లు బాధించుటపాడియా! మీరు భ్రమచే నట్లు కాల్చుచున్నామని యనుకొని వాతఁ బెట్టినను శ్రీమన్నారాయణచరణారవింద ధ్యానాసక్తులగు యోగిపుంగవుల నాదేవదేవుఁడు సుధార్షురులముంచి వారికి సంపూర్ణాయువు నొసంగి రక్షించును! చూడుడు! మీరు అగ్ని చే నాతని కాయమున కష్టకృతినొనర్చినను అంతరంగమున వసించు పరమాత్మకు కించిత్తైయిన హానిఁ జేయఁజాలరు! ఏల మీరింకను వృథాడంబరజీవితైశ్వర్యముల నాసించి శాశ్వత సౌఖ్యపరమావధిఁగాలఁదన్నుదురు! ఆతని పరమోపదేశమును లక్షించుఁడు! గానముచేయు గేయరాజముల శ్రవణపేయముగ దనివితీరఁగోలుఁడు!

గీ. భ్రమకులోనయి యీభక్తి భావమూర్తి
నేలహింసింతు రూరకు జ్వాలసూర్య
కాంతిదహియింపనేర్చునే కాష్టజనిత
కించిదగ్నిసంజనితోష్ణసంచయమ్ము.

శివ—శబాస్ పూజ్యులారా! నీవపరభారతివి! సాక్షాద్భక్తజన మందారంబవు. నీయత్త యుపతరించిన పరమాత్మ! తల్లీ!

కోపాటోపంబున నీవు నాయెడలిపైనుంచిన యీ యినుప కమ్మి గాఢతరతీవ్ర వేదనాపాదకంబయ్యు నేకతంబుననైనా నా కొంతయు బాధఁ గలుగఁజేయలేదు. నా యెడ్ల నైంద్రజాలికము శాంతిపరతిభఁ లేవు.

శివనా—డు. కేవలపాండురంగి పదకీర్తనము పరలోకసౌఖ్యనం జీవనిగా నిరంతరము జీవముగాఁ గొనిసంచరించు నీ పావనమూర్తికీర్తి బహుమానము నాకుగ్రహించినాడునా జీవితమెల్ల పుణ్యవిశేషీకృతమయ్యె పవిత్రసంపదన్.

కేవలము పాండురంగ పదపద్మమకరందపానాయత్తచిత్తుఁడనగు నాకెట్టి పాంచభౌతికయవాంతరములు క్లేశమావేశింపవు. నీవొసంగిన బహుకృతి నా కంకాళము స్పర్శన దర్శనాదులచే సంపాదించిన యఘరాసిని ధగ్ధమొనర్చినది! మానసికముగ నేనెల్లప్పుడు నాదేవునిఁదక్క నన్యముఁ దలఁచి యెఱుఁగ ! నీయాశీఃప్రభావమున మున్ముందుఁకూడ నాకోరికె రిత్తవోకుండునుగాక. నాశరీరము సుధాప్రసారమునఁబలె—నాజిహ్వామధుర ఫలరసాస్వాదనమునఁబలె—నా మనస్సకలంకమిత్రసంయోగమునఁబలె దూమెల లూఁగించితివి! కృతజ్ఞుఁడను! ధన్యుఁడను! ఈవిషయ నిర్ధారణకై పరమేష్ఠి సన్నిచటికేతెడప్పుడుఁ గొనివచ్చి యుండనోపు! కాదేని మా తల్లి చవిఁగొన్న శిక్షామృతము నాకు లభింపకపోయెడిదియే ! నాచునం దగులుకొనియున్నను విరితమ్మి వికసించునట్లును, తారాపతిమృగాంకమున నీమత్కళంకితుఁడయ్యు మెఱుఁగువడయు చందంబున నీసాధ్వి మీా మధ్యఁ బొలుపారుచున్నది. పాండురుచిమండల కీర్తికలాపముచే నీ సాధ్వి జగద్వలయంబున శాశ్వతజోత్స్నలహరిఁ బాడించుఁ గాక ! ఈయమ సాంగత్యమున మీాయిరువురి జన్మంబులు

ధన్యంబులైనవి ! మించినది లేదు. పాండురంగ ప్రభుని దర్శించి మీరొకసారి మీమనస్సు శుద్ధిపఱచుకొనుడు రండు! నేను పండరికిఁ బోవుచున్నాను. మీరందఱు బయలు దేరుఁడు. అశాశ్వతంబగు నీయర్థైశ్వర్యంబుల కాసపడి తుచ్ఛ్యకుడు ! అమ్మా ! సక్కుబాయీ! సెలవు! నీమనోతపఃప్రభావంబున నీనిలచిన ప్రతిచోటు పవిత్రమై—పూజ్యమై వెలుఁగుఁగాక!

గీ. ధన్యమయ్యెనుసుమ్మ నీదర్శనమున
నాదు జన్మమ్ము పోవుచున్నాఁడ నింక
పండరికి ముక్తిలోకైక పథమునంటి
సెలవు నీభక్తి నిర్మలాశీస్సునిడుము.

అత్త—నీగోడవమాడిపోను! తక్షణం నాదృష్టిలో ఉండకు! దరిద్రప్పి నుగా! యిల్లాంటి మెట్టవేదాంతము ఎంతేనా చెప్పొచ్చు! విశ్వం వీణ్ణిదూరంగా తఱిమెయ్యి!

విశ్వం—ఒరే! నీదేంఒళ్ళా–రాయా! కాల్చినా కాలలేదేమిరా? నీవు మళ్ళీ యింక ఎప్పుడు యీవీధికిరాకు! వస్తే కూనీచేస్తాను. జాగ్రత! (అని గెంటును.)

(తెఱపడును.)

---

## ద్వితీయరంగము.

---

అత్తగారు ప్రవేశించును.

అత్త—పోనీ! కొన్నాళ్ళకు కాకపోతే కొన్నాళ్ళకేనా బుద్ధిమళ్ళి మన లో పడుతుందేమో అని ఆలోచిస్తే ఏమీలాభం కనపడ్డం లేదు. పైగా దీని పుట్టింటివాళ్ళు నన్ను ఎన్నిమాట్లు వెళ్ళినా పట్టుమని ఒహసైనుగుడ్డ నామొహాన్ని పడేశారా? వాళ్ళ మీ

దుండే కోపం దీనిమీద తీర్చుకొంటా! నేనన్నిమాట్లో ముచ్చ టపడి ఏదైనా తగువు తంటా తెస్తారా అని చూస్తే యీతం టా వారాత్రిం యీబొమ్మలాటకి తగిలించింది! నేను దీన్ని కొట్ట డం తిట్టడంచూచి చాలమంది వీధిలో వెళుతూంటే పిచ్చిముం డనిచూచి హేళనచేసినట్టు నవ్వడం చప్పట్లుకొట్టడం యీల వెయ్యడం యిల్లా జరుగుతోంది! వీళ్ళతల్లికడుపుకాల వాళ్ళ కీ మాత్రిం యిల్లాంటి గుంజుకోటాలుఉండవుగా! ఏమైనా సరే నాప్రజ్ఞచూపిస్తా! దీన్ని ఆబొమ్మతో మాట్లాడకుండా చేసితీరతా! చచ్చినా కినకడకుండా ఉండేటట్టు యినప్పెట్టె లోపెట్టి రెండుతాళాలు బిగించా! బ్రహ్మకేనా రాదు! ఎల్లా తెస్తుందిచూస్తా! (అనిపోవును.)

[సక్కుబాయి ప్రవేశించును.]

సక్కు.—ఓహో! పరమాత్మా! నిన్ను యినుపమందసములో బంధిం చుటకు నాయత్తగారు యత్నించినను గారడియొనర్చినమా డ్కి నాతలంపు నెఱిగి చిన్నిగజ్జెలు మ్రోయఁ జిందులాడుచు వచ్చితివా! రమ్ము! జగన్మంగళాకారా! కాళీయఫణిఫణాగ్ర మున నొనర్చిన చిత్రవిచిత్ర నృత్యవైఖరుల నొక్కపరి జూప వా? భావనా ప్రపంచసాగరమున నీదివ్యమంగళరూపమ్మును నొకనుపలక్షించియాడుకొనివచ్చుచున్నాను—దయయుంచి నా దరికి రమ్ము! చంద్రికాప్రసారమున జీవనోపాధి ననుభవించు చక్రవాకమట్లు—దినమణి సందర్శనోత్సుక్య పద్మరాజంబట్లు—హిమకరోదయ సమయరత్నాకరంబట్లు—ఆత్మీయసంతాన మంజులకేళీవినోదదిదృక్షానందాయత్త చిత్తయగు మాతయట్లు—నవవయోసంభవద్వైభవ విరాజిత భర్తృసందర్శనాపేక్షిత యగు నుత్తమకాంతమాదిరి—ఒక్కటననేల సహస్రకమేయ

సుగుణ లక్షణమూర్తి! నాహృదయ మానందడోలికా లోల మగుచున్నది! నీలీలలు వర్ణించుటకు నలువకైనం దరమా! ఆహా! ఈదివ్యక్షేత్రమేనా (కృష్ణ విగ్రహము కాయము దడవుచు) శ్రీదేవీ కేళికామందిరంబు! ఓహో యీచిన్నారి హస్తములేనా ఋజుమార్గసంచార సంరక్షణాసక్త సాధనములు! అవస్థాభేదములందును నీవు కండ్ల యెదుటనే యుందువు భళి భళీ! నాయదృష్ట మేమనుకొందును?

ఉ. కాళియ శీర్ష భాగమున గంతులు వైచిన నీపవిత్రపా
దాలు మదీయ హస్తముల తాఁకగనిమ్ము ప్రసన్నమూర్తి కే
ళీలలితమ్ము నీ మురళిలీలల వీనులఁ గ్రోలనిమ్ము నీ
నీలశరీర కాంతులను నిండగఁజేయుము నాదు కన్నులన్.

అనుబంధము.

(అత్తగారు ప్రవేశించును.)

అత్త—అయ్యో! అదేమిటే! మళ్ళీ ఆబొమ్మ ఎక్కడిది? ఏదీ! (పుచ్చుకొని) ఇదే! దీనిదుంపతెగ ఎన్నిమాట్లు మాయంచేసినా యిట్టే వస్తోంది దీనిదగ్గఱకి! ఇదేంమాయోకాని! ఏమే నీ అబ్బసొమ్మనుకున్నావా మందసంలోనుంచి దీన్ని ఎట్లా తెచ్చావ్!

సక్కు—నేను యినుపమందసములోనుంచి నాకృష్ణు నపహరించలేదు. నాహృదయపేటికాంతర్భద్రితంబగు నీప్రతిమ మీరెన్నిభంగుల గుప్తమొనర్చినను నిష్ఫలము! నిష్ఫలము!! రజ్జుసర్పభ్రాంతిని మీరా బొమ్మనుగాంచి భీతిల్లుచున్నారు! ఆబొమ్మయందుఁ దేమియు మహత్తు లేదు! ఆప్రతిమ నారాధించు మనస్సునందా మహత్తుతాండవించుచున్నది! ఒకపరిమీరుగూడ న్యాయదృష్టిచే నీప్రతిమ నుపలక్షించిన మీరు తలఁచిన రూపముఁ బొందఁగాంతురు! ఈబొమ్మయందలిమూర్తినే హానుమఁ ధనవ

రత రామనామసంకీర్తనమున వశమొనర్చుకొనెను. ఈబొమ్మ యందలి మూర్తినే దలంచి తలంచి గుహుండు జేయ మోక్ష సామ్రాజ్యముం జూరగొనెను. ఈమూర్తిని సతంబుజపించి వసిష్ఠాగస్త్య నారదాదిమునిబృంద మఖండమగు దేవపదముం జేరిరి! గాన కనులుందెఱచి ప్రభుని ధ్యానించుడు! నేను చిన్న దానను. మీకింకేమియుం జెప్పంజాలను.

సీ. ఈరూపమేసుడీ ఇనకులతిలకమై
శబరికి ముక్తి వశమ్ముచేసె
ఈమూర్తియేసుడీ యిచ్చెనల్లయహల్య
కనుపమరూపభాగ్యములనెల్ల
ఈచిన్నవాఁడెసుడీ వ్రజభామినీ
మణులకు సౌఖ్యసంపదలొసంగె
ఈప్రతిమమ్మెసుడీ రాధికావీక్ష
ణములలోనిత్యమ్ము నాట్యమాడె
గీ. ఇదియె ఈశిలాప్రతిమమ్మె ఎవరికెఱుక
రాని మానవులకు నందరాని గతుల
లీల చరియించి దైవీయలీలనించి
వెలుఁగు పండరీ శ్రీరంగ విఠలమూర్తి.

అత్త—నిన్ను నేను భరింపలేను నీకేదో పోయేకాలం సమీపించింది లేకపోతే ఒద్దన్నపనిమానకపోవడం రోగంకాదూ! నీవు ఒక 'టేశిక్ష నాయింట్లోంచి లేచిపో! దరిద్రంమొఖం చూస్తే నర కంకూడాను! ఎన్నోజన్మాలనుంచి తగనిపాపం చేశాము గను కనే మాకొంపకి కొఱకంచులాగ దొరికావు! నీకో నమస్కా రము. లేచిపో! పో! (అని బాదుచు గెంటివైచును.)



శుభమస్తు.

# సతీసక్కుబాయి

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

(పండరికిఁబోవు భక్తులు—శివనాథయోగి భజనఁజేయుచు ప్రవేశింతురు.)

అనుబంధము 7.

శివనాథ—భక్తులారా! పండరిపురముఁ సమీపించుచున్నాము. గమనించితిరా జగన్నాథదర్శనకౌతూహలంబున గమనశ్రమం బెంతయుఁ దోపకున్నది! ఆకలిదప్పులు దవుదవ్వులకుఁ దొలఁగి బిక్కత్రిమూపుల బెదరుచున్నవి! ఐహికానందవాంఛానైస్పృహ్యమ్మున నేకైకవస్త్రధారులమైనను మనకెట్టి బ్రాంతియు గలుగుటలేదు! శీతవాతాతపానుభవభేదము మనకు మృగ్యము ఆహా! ఆదివ్యనామస్మరణామృతమెంత మధురమైనది! ఆ మంగళాకారుని స్మరించి, ధ్యానించినంతమాత్రమున మీ పాపాంధకారము పటాపంచలగును. మీహృదయ మాలిన్యము పరిష్కృతమగును. మీకు ప్రాణభీతియుండదు. మనోదార్ఢ్యము—ధీరతయుఁ జేకూరును! ఏదీ ఆమంగళకర తేజోనిధిని కీర్తింపుడు!!!

గీ. అగ్నిలేశకణమ్మైన నంటినంత
యెండుటాకులు భగభగ మండునట్లు
పాండురంగ నీరజపద స్మరణవలన
పాపరాసులెన్నైనియు బాసిపోవు.

మనకు అవస్థాపరిపాకంబున భగవద్ధ్యానము లబ్బునని కొందఱు వచింతురు. అది యపోహ. సంసారజనితానేకరోగ సహితంబును, నిత్యతాపత్రయాక్రాంతంబును, దృఢతర పుత్రకళత్ర విత్తవిలసత్పాశనిబద్ధంబును, గర్వాంధంబు, బహుపాపవర్గ సహితంబును నగు మన యాయుష్కాలమున పరమేశ్వరధ్యానమున కొక యవస్థనేల నిరీక్షింపవలయును? వలదు వలదు! దయాసముద్రుఁడగు రామభద్రుని భజించి త్రికాలములందు నా మంగళాలయు శుభకంఠసీమ నమ్లాన స్వచ్ఛగేయసరోజమాలికా సహస్రంబున నలంకరించుడు! శ్రీహరి కరుణాకటాక్షమహిమాగత దివ్యజ్ఞాన ప్రభాతంబున పుణ్యలోకముల నాలోకించుడు! ఆహా! ఇంతింతనరానిదై—మేరుపర్వత సంకాశమై వెలయు నాపురాణ పూరుషుని శుభాకారము మన హృదంతరాళమున సూక్ష్మతర సూక్ష్మమై మనోమోహనమై వర్తించి, సకల ఫలచంపకీ సుమసురభిళమై—మధురతర పద్మ మకరందమై మనోహర దివ్యనాదప్రదంబై ఏరీతిఁ దలంచిన నాభంగి ఫలితంబొసఁగు నెవ్వఁడా దేవదేవునికంటె మన మేరిని స్మరింతుము? వెన్న మెక్కిన యా వెన్ననికన్న నవనీతహృదయుఁడెవఁడు? గజరాజు 'కృష్ణా! యదునందనా! కావవే! నీవే దిక్కు" అని తిరముగఁ భక్తిచేఁ బ్రార్థింప సతీ సరససల్లాప సుఖావసరంబున నుండియు నేపరివారముఁగొనక యొక్క యదటున నమోఘశక్తి సంభారంబగు చక్రంబుఁ బ్రయోగించి

మకరిని సంహరించి కాపాడుట మనకు దృష్టాంతరము కాదా? నిశాచరాధినాథ సహోదరుండగు విభీషణుండు శరణుఁగోర శరణాగతత్రాణపరాయణబిరుదంబు తిరంబొనర్చుకొన్న దేవుఁడెవరు? అవతారదశకంబునఁ దన్ను నమ్మి కొల్చు భక్తులకెల్లర కభయంబొసఁగుచు రక్షించిన ముల్లోకజనకుండగు రంగనికంటె మనము చూడఁదలఁచిన దేవరెవరు? పాండుతనయుల ఆరంగనిఁ గూర్చి జిహ్వాగ్రసోపానమున నామామృతరసగని నృత్యముఁ జేయు నిందు!

ఉ. ఈయవనీతలమ్మునను నెందఱు పుట్టుచుఁ గిట్టలేమ, నీ
మాయ నెఱుంగఁజాలరును మా యెవరైనను, భక్తలోకర
క్షాయతనమ్ము నీత్రిదివకల్పిత నిర్మలవీక్షణమ్ము, రం
గా! యెటులన్ మముం బ్రణవమందు జిగీషుల చేయఁజాలదో.

ఉ. పండరినాథ! భక్తపరిపాలక! తావకనామకీర్తనా
ఖండరుచుల్ మదీయమగు కల్మషమంతయుఁ దీసివేయ శ్రీ
మండితమైన నీకరుణ మామకకిల్బిషమెల్లఁ బాప బ్రి
హ్మాండము నిండు నీస్మరణమందు మనస్ గ్రహింపరాగదే.

అనుబంధము 8.

సక్కు.—దేవా! కాలమెన్నిభంగులు నీమహిమఁ జాటుచున్నను శునకపుచ్ఛంబు వంకఁ జెన్నారు నాబుద్ధి పరిశీలనఁ బొందకున్నది! అత్తకోపించి యిలువెడలఁగొట్టినను—భర్తయందలి యనురాగము—భక్తి నన్ను పిలుపుంద కీడ్చుచున్నవి! అయినను, రంగద్రింగపదారవింద ధ్యానంబున పునఃపునః యత్నించి నేనట్టి యబ్బురముఁ బోఁగొట్టుచుంటిని! త్వగస్థిమాంసపేశలంబగు నీశరీరముపైఁ గాంక్షవీడినను సంపూర్ణముగ నాపరంధామ శ్యామలాంగముపై నాచిత్తము నిలువకున్నది! నాయత్త నా

శ్రీపంకజాస్య లక్ష్మితము లా నీకనల్
నాపాపమూర్తి కాంచంగలేవా
పారిజాతసుమాలంబట్టు నీకరములు
నాకిర్బిషము సంటంగలేవా
మునినాధసేవితంబులు నీదు చరణముల్
నాయుత్తమాంగంబు తోక్రియలేవా
గీ. స్వర్గలోకైక వాసనాభ్యస్తమైన
నీతనువు నా యొడందలో కలుపలేవు
పరమపావనుఁడవు నీవు పాపినేను
ఎటుల రక్షింతువో నన్ను నింక రంగ.

శివ—

చ. ఎవరిది—బలాంప్రబోధనీనకనక మోహనకిన్నరీ నినా
ద విమల గీతికాసఫలె, ధ్యానసుధ మ్ములు, భక్తిపూరితా
రవములె, కేవలప్రణవరంజిత భాసములే ప్రశాంత భ
క్తివివశ వాక్యపూర్ణ స్మృగంధములే వినవచ్చె హాయిగా.

ఆఁ! ఆఁ! వినుఁడు వినుఁడేగో కిన్నెరనాదము వినవచ్చుచున్నది! ఆల
కించు డది నాకీనులల కంఠరవంబుగాని యొండుగాదా. అది
యుం బరమపావన భక్తిప్రియము! ఆహా! ఆగానము వినిన
కొలఁది శీతలనటవృక్షచ్ఛాయ—పూర్ణిమ సుధావర్షము—మల
యమారుతము — నవవసంతాగమసమయ పుష్పమరందము
నెందునుఁ బనికిరావని నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఉండు
డుండుము! అదిగో పాతాళస్వాతిశవ్యరూపిణి—భక్తజనకల్ప భూ
రుహము—భారతమాత సక్కు—బాయి!—సక్కు—బాయి! నిక్కము
నిక్కము ఆమెయే. భక్తులారా! నేటికి మనము ధన్యులమై

తిమి. వెదుకఁబోయిన తీగ పాదములఁ దగిలినట్లు మనతల్లి సక్కుబాయి అదిగో! (అందరు నమస్కరింతురు)

సక్కు—మహాత్మా! నా యదృష్టమున కొంతయు మేర లేదు. మీదర్శనమెట్లు లభించునాయని తల్లడిల్లితినిగాని యింకను కొంత దవ్వుపోకుండగనే మీరు—భక్త శిఖామణులు దర్శనమిచ్చితిరి! ఒక కోరిక సఫలమైనది! రెండవది రంగని దర్శనము అదికూడ మీయాశీఃప్రభావంబున నీప్రయాణముననే పండరిని లభించును. ఆర్యా! మీరందఱు నెచటికేఁ జనుచున్నారు?

శివ—తల్లీ! మేము పండరీపురమునకు యాత్ర సేయుచున్నాము. వైకుంఠ ఏకాదశీ పర్వదినంబున పాండురంగని కఖండకైంకర్యము సలుపఁబడును. ఆయుత్సవ మమితజనసంకులంబై వివిధ వస్తువిక్రయశాలా నిర్మింతమై దూరదేశాగతభక్తజన కోలాహలంబై అంతర్బహిర్దృష్టుల కానందదాయకమై శోభావహమై యుండును. గావున సక్కుబాయీ! ఈపాపరాసుల నచ్చటకుఁ గొంపోయి యాదేవు నచటనుండి హృదయపూర్వకముగ నమస్కరించి పాప నిష్కృతిఁ బొందుదుము.

సక్కు—(తనలో) ఇదియు దైవసంకల్పమే—కాదేని ఏమహనీయుని దర్శనలాభకాంక్షా విహ్వలనై యుంటినో ఆపూజ్యుఁ డచ్చటనే నను కలిసెను. (ప్రకాశముగా) నేను నాయత్త చే నిలువెడలఁ గొట్టఁబడి పండరికి బోవుచున్నాను. మీయండఁ జేరి నేనుగూడ నిర్భయముగ గమ్యస్థానముఁ జేరవచ్చు!

శివ—అంతకంటె నేమికావలయును దల్లీ! మంగళస్వరూపునిఁ గీర్తించుచు మెల్లగ పోదమురండు!!

గీ. రండు రండు పాండురంగని భజనకు
రండు రండు! పాండురంగపురికి

రండు రండు ! రంగరంగాయటంచును
ముక్తిలోకమార్గము నుకొంచు.

అనుబంధము 10.

(అనిపాడుచు బయలుదేరుదురు)

విశ్వే—అమ్మా! అమ్మా! ఏదే? నీకోడలు ఏమూలజూచినా కనపడ్డం లేదు? ఏమయిపోయిందే? ఆ! ఆ! చూడు ఆయింట్లోనూ యీయింట్లోనూ-

అత్త—ఏమిటే! ఎక్కడకు పోతుందిరా! మనన్నివాదిలేగ్రహం కాదు! ఇంతట్లోకిపోదు. మరేంభయంలేదు! ఏమూలో ఆబొమ్మతో ఉంటుందిచూడు లేకపోతే వీధిలో ఏబైరాగాడేనా వచ్చేడేమోచూడు! వాడితో పోతుంది! దానికేం భయమా! భక్తా?

విశ్వం—(ఆతురతతో వీధిలోనికిబోవును.) అబ్బో చాలాదూరాన్ని జనం పాటలు వినబడుతున్నాయి అక్కడుందేమో చూస్తాను.

(పరుగెత్తును.)

(జనంలోనుంచి భార్యనుజూచి)

ఏమే! నీకు మొగుడూ మొద్దులూ అత్తా అదుపూ ఏమీ లేదా ఏమిటి?

అత్త—ఓసి నీమొహంతగలెయ్యా పాండురంగడు, పాండురంగడని యేడుస్తూ ఆఖరికి సన్యాసుల్లోకలిసిపోతావటే. దరిద్రిగొట్టు రాక్షసీ. అయ్యయ్యో, ఎంతతెగించిపోయావే నక్కు బాయమ్మతల్లీ,

నక్కు—అత్తగారూ—

అత్త—ఏమిటిలత్తగారూ అని సాగదీసుకుంటూన్నావు. ఎల్లా తగులడ్డావేయిక్కడికి? (పక్కకిచూచి) హరిపీడి మొహంమీద కాలీకాలీ కొరకంచులుపెట్ట? వీడిక్కడేచస్తున్నాడూ? ఓరి సన్యాసిముండాకొడకా! నీదేంపొయ్యేకాలంవచ్చిందిరా నాకో

డన్ని వెంటపెట్టుకొని తగ్గులజ్జానికి నీకేం పెద్దరోగం వచ్చిందిరా?

భర్తుడు—ఏమమ్మోయి! ఏమిటి అతిట్లు?

అత్త—ఏంనాయనా? తిట్లుతిట్లని మహావెనకేసుకువస్తున్నా వాడెరా గాడిని. వాణ్ణి నేనుబాగా ఎరుగుదును వాడికి నేను యిదివర లో వాతలు పెట్టానుకూడాను.

భర్తుడు—ఆయోగిసంగతి సందర్భములు తెలియకుండా ఏమి అన కమ్మా! ఆయన మహాత్ముడు జనులని తమ పాపరాశుల నించి విముక్తులని చేయడానికి బయలుదేరిన ఆయన్ని కట్టుకు తిడు తున్నావు. నీకు సద్గతులుంటవాతల్లీ ఇంకనైనా ఊరుకోవమ్మా!

అత్త—ఆయనెవడికికావాలి? నీవెవడికికావాలి? ఇద్దరూ కట్టకట్టుకుని గంగలోదిగండి. (సక్కుబాయి నుద్దేశించి) ఏమె ముండపీనుగా ఇంకనైనా యింటికి నడవ్వే?

విశ్వే—అమ్మా! నువ్వలావుండు. నేను దీనిసంగతి కనుక్కుంటాను. [సక్కునుద్దేశించి] ఏమే' నువ్వు నాతో చెప్పకుండా తీర్థయా త్రలకి బయలుదేరడం తప్పుకాదూవా? కాదంటావా? చూడు నిన్నేంచేస్తానో లే నడు. (సక్కును తీసికొని పోవుదరు.)

1 వ భక్తుడు:—ఆహాహా! ఎంమహాతల్లండీ యీ అత్తగారు ఈభక్తు రాలు సక్కుబాయి పండరీపురమునకు మనతో రాజాలకపో యినది. పాపము.

శివయోగి—భక్తులారా! పండరీపురమునకుం బోవుదము రండు! చూచితిరా మహాసాధ్వి సక్కుబాయిని, ఆమె ముఖము చూచినచో సకలపాతకములు నశించును. వినుడు సంసారియై నను, సన్యాసియైనను భోగియైనను, పరబ్రహ్మత్వము నెఱింగి నవానికి శాశ్వతానంద మొదవును.

శ్లో. యోగరతోవా భోగరతోవా సఙ్గరతోవా సఙ్గవిహీనః
యస్యబ్రహ్మణి రమతే చిత్తమ్ నన్దతి నన్దతి నన్దత్యేవ.
అనుబంధము 10.
పాడకొనుచు పోవుదురు.

---

ద్వితీయరంగము.

---

తాలూకాబోర్డు ప్రెసిడెంటు—బడిపంతులు కనకయ్య.

పంతులు—(ప్రెసిడెంటు నరసింహారావునుజూచి) అయ్యా! మాతల్లి గారికి చాలాజబ్బుగా నున్నదండి. నాభార్య పుట్టినింటనున్న దండి. ఇంటిలో చాకిరీచేయుట కెవ్వరును లేరండి నాభార్యను పుట్టినింటినుండి తీసుకు రావలెనండి. పదిరోజులు సెలవు అనుగ్రహించాలని కోరుతున్నానండి.

ప్రెసిడెంటు—(పేపరు చదువుకొనుచుండును)

పంతులు—అయ్యా!

ప్రెసిడెంటు—ఏమయ్యా చీటికీ మాటికీ సెలవని వస్తుంటావు. ఉద్యోగానికి రాజీనామా దాఖలు చేసుకోగూడదూ, అస్తమానూ యింట్లో పడివుండవచ్చును.

పంతులు—చిత్తం తమరలాసెలవిస్తే నేనేం మనవిచెయ్యానండి. కష్టసమయమండి.

ప్రెసిడెంటు—నీకుకష్టాల్లేని దెప్పుడయ్యా? అస్తమానూ మాతల్లికి జబ్బుఅనీ, ఇంట్లో పిల్లి సమారాధించిందని, ఎలక్క కాలుమీద వ్రణమువేసిందనీ యేమస్తావు. వెళ్ళు సెలవియ్యడానికి వీల్లేదు.

పంతులు—తమరలా సెలవిస్తే ఎలాగండి? నాకు యిట్లో చాలా యిబ్బందిగావుదండి. ప్రభువులు ఎలాగైనా కటాక్షించాలి.

ప్రెసిడెంటు—అబ్బబ్బా! చెవి తేనికుకాదూ? పో, అవతలకి.

పంతులు—అయ్యా, చాలాబీదవాణ్ని.

ప్రెసిడెంటు—చెవి తేనికుకాదాఅంట. నిన్ను తెన్ నాన్సెల్ నిన్ను సస్పెండు (Suspend) చేయిస్తాను. ఫిఫ్టీన్ డేస్ Fifteen days) నిన్ను సస్పెండుచేశాను.

పంతులు—బాబుగారూ! నన్ను రక్షించకపోతే దిక్కులేదు.

ప్రెసిడెంటు—వాట్ఎస్టుపిడ్ యూఆర్ గెట్అవుట్ వెళతావా వెళ్ళవా? ఉద్యోగం ఊడపీకించేస్తాను.

పంతులు—అయ్యా! కష్టకాలంకాబట్టి తమర్ని ప్రాధేయపడుతున్నాను. అనుగ్రహించి సెలవిప్పించాలండి.

ప్రెసిడెంటు—నాన్సెన్సు! నిన్ను యీక్షణంలో డిస్మిస్ చేశాను పో.

పంతులు—అయ్యా! నానోటిలో మన్ను వేయకండి. పిల్లలుకలవాణ్ణి.

ప్రెసిడెంటు—ప్ఫ్యూ వీణ్ణిగెంటెయ్యి. పో. ఇడియట్.

పంతులు—ఏమిటి ఇడియట్ అంటావా స్టుపిడ్ రాస్కెల్ అని యీ పేలాపనయేమిటంట? నీకు బుద్ధిఉందీ? నీకు పెద్దమనిషితరహా తెలుసునూ? పదిమందీ పట్టుపట్టి సాయంపడితేగాని యీనాటి దాక ప్రెసిడెంటుపదవి రాదుగదా. నీకెంతగర్వంవచ్చిందీ? సెలవకావాలంటే యిలాపేల్తావా? నీఉద్యోగంఎవడికికావాలి? నీబుద్ధినాకు తెలవదనుకున్నావా? నీగుట్టు అందరికీ బట్టబయలయిందిలే. నేను నీకు లంచం యివ్వలేదనే నీకు క్రోధం. అందుచేతనే నన్ను మాన్పించేస్తానని యేడుస్తున్నావు. వెధవ మేస్టరీ ఎవడికి కావాలిరా? ఈకండకావరం ఎంతకాలమురా? నీప్రెసిడెంటు హోదా ఊడితే నీమొహాం కుక్కలుకాదా

చూడవని గ్రహించు. ఇప్పటికైనా కళ్ళువిప్పుకొని సరిగ్గానడు చుకో. నీగొప్పనీది నాగొప్పనాది ఖదవంటే తిండిగాని నీబాధా రంఅంతా తెలవదనుకొన్నావా? (అని వెళ్ళిపోవును.)

బంట్రోతు—(ప్రవేశించి) ఏమిసార్.

ప్రిసిడెంటు—ఇంతసేపూ యెక్కడయేడుస్తున్నావురా, రాస్కెల్ పో అవతలికి (స్వగతము) ఆహా! ఎలాతిట్టగాను యీ ఫూలు (fool) ఎన్నిమాటలన్నాడు? నన్ను వెధవని చేశాడు గదా. నిజమే వీడన్నట్టు నాబ్రాడారమేముంది! దేశానికి మహా చెడ్డ అవస్థ ప్రాప్తించింది ఎకనమికల్ కండిషన్ (Economical Condition) చాలాపాడుగాఉంది! ఎక్కడచూసినా దరిద్రమే బి. యల్. ప్యాసయినాన్న మాటేకాని, ప్రాక్టీసు (Practise) కానీయైనా లేదుగదా పైగా బార్‌లోకి వెడితే డిన్నర్లనీ, సప్పర్లనీ, డొనేషన్లతోటీ (Donations) సబ్‌స్క్రిప్షన (Subscription) లనీ చంపుతూంటారాయెను. ఊరికి 300 మంది వకీల్సు చాలాకీన్ (Keen) గాఉంది. లాయర్లలో కాంపిటీషను పాక్ట్రీలు కొరకు కళ్లువాచిపోయేటట్లు ఎదురుచూడ్డమేకాని, ఒక్కడు-రాడు. వస్తే కానీచేసని దరిద్రపు వెధవ. అరువుపెట్టి చక్కాపోతాడు.. ఇంట్లో పెళ్లాంగారి పోకులకీ, మనదగ్గరాకీ తక్కువరాకూడదాయెను. పెళ్లాం నగలకి పోరుతుందాయెను. పోనీ యీ మేస్టరు గాడిగలు లాగాలిస్తారా అంటే, అది లేదాయెను. ఎలాఏడుస్తుంది కాపరం?

[ప్రవేశము భార్య సుందరమ్మ.]

(భర్తనుద్దేశించి,) ఏమండీ! ఏమిటీ మహాఆలోచిస్తున్నారు? ఎవరైనా వచ్చి తిట్టారాయేమిటి?

ప్రెసి—నథింగ్ ఆఫ్ దట్ సార్ట్ మై లేడీ (Nothing of that sort my lady) వంట అయిందా?

సుంద—వంటకాదు వల్లకాదయింది. ఏమిటిచేసేదీవంట నాముహం ఏమీలేదు. మన సంపాదనచూస్తే యింత అధ్వాన్నంగా ఉంది. ఉన్న నగలన్నీ తాకట్టుపెట్టి నిప్పిట్టేరామెను. దిక్కుమాలిన చదువుకోసం భూమీ పుట్రీ అమ్మి తగలేశారామెను. ఎంత అడుక్కుతింటున్నా, అనవసరం కర్చు తప్పదామెను. ఎందుకుచెప్పండి మీకు 'హిందూ స్టేట్సుమన్' పత్రిక లు తెప్పించడం? క్లబ్బులో మెంబరుగాచేరడం. అక్కడ తల గిరగిర తిరిగేటట్లుతాగి, 'తాదా లాస్టు', నాకు మహావిసుగుగాఉంది. ఈకాపరం నేను చెయ్యలేను. మాయింటికి వెళ్లిపోతాను. మీరేం చేసుగున్నా సరే. వెధవ కాపరంలాఉంది. పైగా చదువుకుంటూన్నదాన్ని, మాన్పించి, వంటపొయ్యి దగ్గర కూర్చోపెట్టారు. ఏదైనా ఉద్యోగంచేసి, నేనే పోషిద్దునుగా మిమ్మల్ని. మీకు తేలేకపోతే ఎందుకువచ్చిన చదువండీ. అంతా తగలేసుకుని యిలా కూర్చున్నారు సిగరెట్లు కాలుస్తూను.

పెరిసి—అబ్బబ్బా! ఇదేం సాధింపే ఇవాళ యిలామొదలు పెట్టావు. నోరుమూసుగుని ఊరుకుంటావా, తన్ననా?

సుంద—తన్నడమా! ఇంకెన్నాళ్ళండీ యీతన్నులాటలు. మీమగవాళ్ల కర్మంకాలిందిలెండి స్త్రీస్వాతంత్ర్యోద్యమం దేశంలో బయలుదేరి, మహాగ్నివలె విజృంభిస్తున్నది. ఇంక ఆడవాళ్లదే పత్తి మగవాళ్ళు సిల్కుగాజులు వేయించుకోవాలిసిందే.

పెరిసి—ఛీ! ఊరుకో వెధవ సాధింపూ, నువ్వూను. పళ్ళురాలగొట్టేస్తాను తెలిసిందా?

సుంద—అంతే పళ్ళు రాలగొట్టుకోవలసిందే అదే మీకర్తవ్యం మీమాట విన్నన్నాళ్ళువిన్నా ఇంకవినలేను వినను. ఆడవాళ్లంటే

పురుగులనా మీ ఉద్దేశం మీసంపాదన చట్టుబండలైనా సరే గాని, ఆడది యింట్లో ఏడవాలీ? ఓ చదువనేది ఉంటే ఎన్ని లాభాలు ఉన్నవి? ఆడవాళ్ళు అంట్లుతోమడానికీ, అన్నం వండడానికీ, బట్టలుఉతకడానికీ, ఇంటిచాకిరీ చెయ్యడానికీనా, దేముడు పుట్టిస్తా. ఆడదైతే సంతోషంగా ఉండటానికి నోచుకోలేదూ? నాటకాలూ, సంగీతపుకచేరీలుచూడ్డానికి వీల్లేదూ? పక్కపాపిడి దువ్వుకోగూడదూ? జోడు తొడుక్కోగూడదూ? మీటింగులకి వెళ్ళగూడదూ? వెడతానంటే, అక్కడ నలుగురు మగవాళ్ళనీ చూస్తానికాఅంటారూ? మీమాటలకీ, మీచేష్టలకీ మీకే చెల్లిందికాని ఎవళ్ళైనావింటే నవ్విపోతారు. చాలు చాల్లెండి నేర్చుకు పోయారు.

ప్రెసి—వాట్ యీజ్ దిస్ న్యూసెన్సు? ఏమహాపొగరుమోతుతనంగా లెక్చర్ యిస్తున్నావే.

సుంద—అవును. ఇవిఎటువంటిరోజులనుకున్నారు? దిస్ యీజ్ దిగోల్డెన్ ఏజ్ ఆఫ్ లేడీసు (This is the golden age of ladies) అంట్లుతోమేరోజులు వెళ్ళిపోయాయి. అవియింకమీవి. ఉపన్యాసాలివ్వడం, డాక్టరుపరీక్షప్యాసయి వైద్యశాలలు స్థాపించడం, ప్లీడరీలు చెయ్యడంమావంతు. ఇదిగో చెబుతున్నాను. సాయంత్రాన్నుంచి వంటమీదే. మీకుచేతకాదుకనక నేనే ధనార్జనకి పూనుకుంటాను.

ప్రెసి—నోరుముయ్యి. షట్ అప్. షేం. యూ ఆగడం. అర్థంలేని పేలాపన. డామ్డఫ్ఫెలో నోటికివచ్చినట్లు వాగితే వాతలుపెట్టేస్తాను నోటిమీద. ఆడదానిమొహంమీదవంటేగాని, స్వాతంత్ర్యం అనేది వ్రాయలేదుదేముడు. ఆడదిచేసేపని ఎన్నటికీ

రాణించదు. ఏమిటి పెద్దకబుర్లుచెబుతున్నావు? ఇలా అల్లరి చేస్తే విడిచిపెట్టేస్తా.

సుంద—ఏం బెదరిస్తారా? ఉద్ధరిస్తారు. గోన్ (Gone) విడిచిపెట్టిన మర్నాడు సెకండు మ్యారేజ్ (Second Marriage) చేసుకుంటాను. అంతే మాభారతామహిళాసభా తీర్మానాలు వినలేదు కాబోలు వినవల్సలేదులెండి. మా చేష్టలవల్లనే మీకు సర్వమూ బోధపడ్తుంది.

పెసి—ఏం తెగించిపోయావు. మీ ఫాదర్ తో నీసంగతిచెప్పి—ఏం చేయిస్తానోచూడు.

సుంద—చూడాలి. ఏమిటి ఆయన మొహం మీరు మీమొహాం ఆయనాను.

పెసి—ఇంతపెంకితనంవచ్చిన నీతో నేనింక కాపరంచేసేదేమిటి నా మొహం. నువ్వు మీయింటికిపో. నేను యీకాపరం చెయ్య లేను. హాయిగా పండరీపురికిపోయి పాపనాశనం కావడానికి పాండురంగణ్ణి భజస్తాను. రీమ్యారేజ్ చేసుకుంటావో విడో మ్యారేజ్ చేసుకుంటావో, నీయిష్టంవచ్చినట్లు తగులడు. నీవు పిశాచివై పోయావు. (అనిపోవును.)

(తెరపడును.)





 

శుభమస్తు.

# సతీసక్కుబాయి

## పంచమాంకము.

### ప్రథమరంగము.

ప్రవేశము కృష్ణుఁడు, రుక్మిణి.

కృష్ణు—ప్రేయసీ! చూచితివిగదా, జగన్నాటకరంగమున జరుగుచున్న చిత్రములు భక్తురాలగు సక్కుబాయి నామె యత్తగారు స్తంభమునకుఁ గట్టివైచినది. పాండురంగ సందర్శనోత్సుకయగు నామె, విఫలమనోరథయగుటంజేసి, వ్యస్తచిత్తయైనది. ఆమె విషయమై, యేమిచేయుటకును దోఁపకున్నది.

రుక్మిణి—నాథా! జగదాధారుఁడవు. సర్వమంగళమూర్తివి. ఏమిచేయుటకును దోచదన్నంత మాత్రమున నేను విశ్వసింతునా? కాని, ప్రాణేశ్వరా! నాహృదయము నొకసంశయము పీడించుచున్నది. క్రూరురాలగు నీ సక్కుబాయి యత్తగారికి మరణానంతరమునఁ గలుగు గతులెట్టివై యుండును?

కృష్ణు—సతీ! నీవింకను నమాయకురాలివలెనే సంభాషింతువు. ఆమెకోడలి కిడుచున్న బాధలకు నరకమే ఫలమని తలంచుచున్నావా? నీవుతలంచినట్లు జరుగనేరదు. బాధించునప్పుడైన నన్ను తలఁచుచున్నందున నామెకు ముక్తియే లభించును.

రుక్మిణి—మఱి సక్కుబాయికో.

కృష్ణుఁడు—భర్తురాలగు నామెమాట వేఱుగఁ జెప్పవలయునా? మోక్షసౌధమున ప్రధానమగు స్థానమామెకీ పట్టికే ప్రత్యేకింపఁబడినది.

రుక్మిణి—అట్లయినచో నాథా! స్తంభమునకు బాధింపఁబడిన మన సక్కుబాయి విషయములో నేమాలోచించితిరి?

కృష్ణుఁడు—ఆలోచించుటకేమున్నది. ఒక చిన్నచిత్రము చేయనెంచితిని. నేనిపుడు విశ్వేశ్వరభట్టరు రూపమునుబొంది సక్కుబాయి నిర్బంధము సడలించెదను. ఆమె నిరభ్యంతరముగ పండరికిఁబోయి, పాండురంగని సందర్శించును. నేనంతట సక్కుబాయి రూపముధరించి, వీరల నాడింతును. సక్కుబాయి యత్తగారిచిత్తమును భక్తిరసపరిపూరిత మొనరింతును. కాని యొక్కసాహాయ్యము నీవలన జరుగవలసియున్నదిసుమా. సక్కుబాయి పాండురంగని సేవించుతఱి, భక్తి పారవశ్యమున, దన్మయత్వము నొందుచుండును. అట్టి సమయములందొకొక్కప్పుడామె ప్రాణముల గోల్పోవవచ్చును. నీవపుడు సక్కుబాయి కాయమున బ్రవేశించి నాకుఁదోడ్పడుచుండవలయును.

రుక్మిణి—నాథా! మీయాన నతిక్రమించుదాననా మీరెట్లు చేయుమన్న నట్లే యొనరింతును. అట్లగుచో, మీరు నారీరూపము ధరింతురన్నమాట మీలీలావిశేషముల నుగ్గడింప నేరితరము? ప్రాణేశ్వరా! మీరు విశ్వేశ్వరభట్టుతో సరసములాడునపుడు నేనుండ నుత్సహింతును. నాకా భాగ్యమనుగ్రహింతురా?

కృష్ణుఁడు—సరే, అట్లే చూచెదవుగాక. రమ్ము, పోవుదము.

[ తెరపడును.]

---

## ద్వితీయరంగము.

---

[ప్రవేశము సక్కుబాయి స్తంభమునకుఁ గట్టబడియుండును.]

సక్కుబాయి—(తనలో) కటకటా! ఏపాపమొనర్చితినో కాని, నాయత్తగారికి నాపై నిసుమంతైన దయకలుగకున్నది. నా మనసార పాండురంగవిఠలేశ్వరుని ధ్యానింపకుండ నాయత్తగారు నన్నీరీతిని నిర్బంధించినది. నాకర చరణముల బంధించినది. కదలుటకైన వీలులేకున్నది. తండ్రీ! పాండురంగా! నీకు నాపై నింతసైన దయకలుగలేదా? నన్నన్నినాళ్ళీరీతిన బరీక్షించెదవు? స్వామీ! కరినిగాచిన కరుణాస్వరూపుఁడవు భక్తుఁడగు ప్రహ్లాదునిబ్రోచిన భక్తజనమందారమవుకావా? సవతితల్లి పలుకులు ములుకులై నాఁట, ఘోరమై నిబిడాంధకార బంధురమై, భయంకరమృగసమన్వితమై యొప్పు విపినమునం దపస్సుచేసిన ధ్రువకుమారునికి గగన మండలమునఁ దారకాగణమధ్యమున ప్రత్యేక స్థానమీయలేదా? దూర్వాస మహర్షి క్రోధానల జ్వాలలకు బలికానున్న యంబరీష భక్తశిఖామణిని రక్షించినది నీవు కావా? తండ్రీ! రామదాసును రక్షించినదెవరు? దుర్యోధనునిచేఁ బరాభవింపఁబడు సమయమున ద్రుపద పుత్రికకు వలువలిచ్చి మానసంరక్షణ మొనర్చినది నీవుకావా? కుచేలుని గుప్పెడటుకులనాశించి, యాతనిని మోక్షసామ్రాజ్యాధి నాథునొనరించినది నీవుకాదా? అబలను అన్నెము పున్నెము నెఱుంగని అమాయికురాలను. నన్ను రక్షింపవా? రాధా రమణా! బృందావనమున రాధతో సరసాలాపములాడుచు నన్ను మఱచితివా? పలుకవేమి? బృందా

వనము కదలిరమ్ము! నామొఱనాలింపుము? నాబాధలఁగాంచు
టకు నీకుఁ దీఱికలేదా? గోపకాంతలను, విశ్వమోహనమైన
నీమురళీగానముచే తన్మయతఁ గేరించుచు నామాటనే మఱ
చితివా? అక్కటా!

సీ. వంశీనినాద తన్మయమైన నీయెద
వినలేదొ నాయార్తి వివశవాక్కు-
భక్తరక్షాదక్షభరితమౌ నీహృది
కనలేదొ నాకష్టకలితగీతి
యదులోకవిహరణా యత్తమౌనీయాత్మ
పడలేదొ నాపాప భరితరవము
గోపికాశ్లేషాని గూఢమౌనీమది
కోరలేదొ నాతప్త శరణరవళి

గీ. పరమపావనమైన నీభవ్యమతికి
పాపమయమైన నారోదనాపవిత్రి
రావములు వినిపింపఁగాలేవొ, యేమొ
రమ్ము! దయఁజూడునన్ను శ్రీరంగరంగ!

కృష్ణా! యదుభూషణా! ఈబాధనింక సహింపఁజాలను రమ్ము!
నన్ను కరుణించి మోక్షము నిమ్ము!

అనుబంధము 11.

ప్రవేశము విశ్వనాథుని రూపమున కృష్ణుఁడు

(కట్లువిప్పుచు) అయ్యో! ప్రాణేశ్వరీ! నిన్నెంతఁ గాసిచెందించితిని. రమ్ము, (కురులు నిమురుచు) మాతల్లిగారి యనురోధమున నిన్ను పండరికి పోపఁజాలనైతిని ఇప్పుడైనను మించినదిలేదు. పండరికిఁ బొమ్ము. పాండురంగని సేవించిరమ్ము. నేనన్నమాటలకుఁ గినియక నన్ను మన్నింపుము.

గీ. పూజ్యురాలైన తల్లి యాపొంత ప్రాణ
పదముగానుండు భార్య యీపత్నికన్న నెవరి
కనుగుణమ్ముగఁ జరియింపనగును నాకు?
ఎరుక లేదె నాకష్టము లింతి నీకు!

సత్య—ధన్యురాలనైతిని. నాథా! తమయవ్యాజకరుణాతిరేకమున కెంతయుఁ గృతజ్ఞురాలను. నేటితో నాజన్మసార్థకతఁ గాంచినది.

గీ. ఏమివచియింపఁగలను నాహృదయమందు
పొంగుచుండిన యానందమున మహాత్మ
నాకృతజ్ఞతాకూలముల్ నాదువలుకు
లనుగమించి, చరించు మీ యాదైన ప్రేమ.

కృష్ణుఁడు—ప్రేయసీ! లోకములో పతికిఁ దోడ్పడుటకు తల్లి తరువాత సతికంటె వేఱొండు ముఖ్యమగు పదార్థము లేదుగదా.

సీ. సంసార పథపరిశ్రాంతుఁడౌ పురుషుఁడు
తలదాచుకొను నీడతరళనయన
బహుకష్టభరిత జీవన నీరనిధిపూరు
షుఁడు పట్టుచుకొను సుదతిమిన్న
ప్రాపించి కానుభవ తమస్సున పురుషు
వెలుఁగు జేర్చెడు దివ్యజలజగంధి
ఇహలోక కార్యవాహినియందు పురుషుని
దరిచేర్చునౌక కాంతాలలామ

గీ. పనులదాసి, యాలోచనమందు మంత్రి, భోజ
నమున తల్లి, యాదిగఁగల్గు నయగుణముల
వెలుఁగుచుండి సకలకార్యవిధములందు
పురుషునకుఁ దోడుపడుచుండు పువ్వుఁబోఁడి.

నీవింక శీఘ్రముగా పుండరికిం బోయి, పాండురంగ సందర్శనానంతరము తిరిగిరమ్ము.

సక్కు—మహాప్రసాదము. నాకు సెలవిండు. కాని మీ తల్లిగారు దూషింతురేమో.

కృష్ణుఁడు—అబ్బా! అవియన్నియు నెందులకు? నేను చెప్పితినిగాదా నీవు వెళ్లవచ్చునని. (సక్కుబాయి నిష్క్రమించును.)

(తెరపడును)

---

# ద్వి తీ య రం గ ము.

---

## పాండురంగని ఆలయము.

(ప్రవేశము:—శివనాధయోగి, భక్తులు.)

శివ—భక్తులారా! మనశ్రమఫలించినది. పాండురంగవిఠలేశ్వరుని సందర్శనభాగ్యము మనకు లభించినది. నేఁటితో మనపాపరాసులు పటాపంచలైనవి. పాండురంగని దివ్యమంగళవిగ్రహమును సందర్శించుఁడు. పాండురంగనిగూర్చి భజనచేయుఁడు. పాపవిముక్తులుకండు. ముక్తిఁ బొందుఁడు. పాండురంగఁడు మీకోరికల సఫలమొనరించును రండు. పాడుఁడు.

శ్లో. త్వయిమయిచాన్యత్రైకోవిష్ణు
ర్వ్యర్థం కుప్యసిమయ్య సహిష్ణుః
భవసమచిత్తస్సర్వత్రత్వం
వాఞ్ఛత్యచిరాద్యది విష్ణుత్వం ॥భజగోవిందం॥

భక్తులు పాడుచుందురు.

[తెరలోపాట.]

పాండురంగా! పాపభంగా!
పావనాత్మ! బ్రోవరావా?
మంగళరూపా! మాన్యచరిత్రా
నందకుమారా! నన్ బ్రోవరా.

శివ—ఓహోహో! పరమపావని—మహాభక్తాగ్రగణ్య—సాధ్వీలలామ సక్కుబాయి గానామృతము గ్రోలు భాగ్యము మనకబ్బినది. పాపము ఎన్నియిడుమలనైనబడి తుదకిచ్చటకుఁ జేరుటకు పాండురంగని యపారకృపయే కారణమైయుండును. ఆహా!

గీ. తతమహాభీలకష్టసంతతులకోర్చి
యైహికపరిశ్రమాదుల ననుభవించి
పండరీపుర శ్రీరంగ భజనకొఱకు
వచ్చుచున్నది యదే సక్కుబాయిసాధ్వి.

సక్కు—(ప్రవేశించి) ఆహా! నాపతి నాయెడచూపిన దయవలన పాండురంగని సందర్శింపఁగలిగితిని. ఆహా! ఏమి వైభవము! ఎందఱుభక్తులు! పాండురంగని దివ్యమంగళ విగ్రహమదిగో! ఈదృశ్యమెంత నేత్రపర్వముగనున్నది. ఇదిగో యిక్కడనే యున్నారు. శివనాథయోగిపుంగవా! ఇవియే నాప్రణామంబులు గైకొనుము.

శివ—దీర్ఘసుమంగళీభవ పరమసాధ్వీమణీ! నీనిడినారవిందము సందర్శనమాత్రమున మాజన్మలు తరించినవి తల్లీ! నీవపరభూరతివి రమ్మా. భజన చేయుదము రమ్మా. భక్తులారా! వినుఁడు! జీవితము బుద్బుదప్రాయమైనది.

శ్లో. నళినీ దళగత జలమతి తరళం
తద్వజ్జీవితమతిశయ చపలం
విద్ధివ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతంచ సమస్తం॥

సక్కు—(తన్మయత్వము జెంది ప్రాణములం గోల్పోవును.)

శివ—అయ్యో! అయ్యో! భక్తులారా! సక్కుబాయి పాంచభౌతికమగు నీదేహమును విడిచి పరమాత్మలో నైక్యమొందినది. అక్కటా! ఈదుఃఖవార్త నిప్పుడు మన మామె భర్తకు దెలియజెప్పుదము. రండు. భక్తులారా! ఈమె యాత్మశాంతికై పాండురంగని ధ్యానింతము.

శ్లో. కురుతేగంగా సాగరగమనమ్
వ్రతపరిపాలన మథవాదానం
జ్ఞానవిహీనస్సర్వమతేన
ముక్తిం నభజతి జన్మశతేన ॥భజగోవిందం॥

---

## తృతీయరంగము.

---

ప్రవేశము:—విశ్వేశ్వరభట్టరు, సక్కుబాయి రూపమున కృష్ణుడు.

మాయసక్కు—ప్రాణేశ్వరా! మీరు నేడేల నివ్విధము చింతాక్రాంతులైయున్నారు? మీ హృదయావేదన కారణమును నే నెఱుంగదగనా?

విశ్వేశం—ప్రియసీ! నాకు నీవిషయమయ్యే విచారము కలుగుచున్నది. నీవమాయకురాలవు. నాతల్లి నిన్ను ఎన్నోవిధముల బాధించుచున్నది—కొట్టుచున్నది. ఆమె నిన్ను నిందించునపుడు

నాచిత్తమున సంక్షోభముదయించును. ఆమెమూలమున నిన్ను నేనుకూడ బాధింపవలసివచ్చుచున్నది. సక్కూ! ఇఁక మా యమ్మమాట వినదలఁచుకొనలేదు. వినను.

మాయసక్కు——తప్పు. విజ్ఞులగు వారట్లనఁజనదు. "తల్లికంటెవేఱు దైవము లేదని పెద్దలు చెప్పుదురు." తల్లిమాటవిని తీర వలయును.

విశ్వే——ఎన్నాళ్ళని యోర్చుకొందును. ఆమె నిన్ను కసరునపుడు నా మనస్సు చివుక్కుమనును. ఈదిన మారంభముగ నీవొక్కపని యైన జేయకుము. మనకు వండుటకై వంటలక్కనేర్పాటు చేసెదను. నీయిష్టమువచ్చినట్లు పాండురంగనిగూర్చి రేయిం బవళ్ళు పాడుకొనుము.

మాయసక్కు——నేను ధన్యనైతిని. నేచేసికొన్న నోములు నేటికి ఫలించినవి. ఇంటిచాకిరియంతయు నేనేచేసెదను. అత్తగారిని కష్టపెట్టకూడదు.

విశ్వే——సక్కూ! నీమాటలు నేడు నాకు చిత్రములుగా గన్పట్టు చున్నవి. నీచర్యలుకూడ నాకాశ్చర్యము గొలుపుచున్నవి.

మాయసక్కు——నాథా! నాయందలిప్రేమాతిరేకమున నట్లనుచుంటి రికాని, నాచర్యలయందు-నాసంభాషణమునందు మార్పేమి యు లేదు.

విశ్వే——అబ్బా! నాకు నీ పరివర్తనము బొత్తిగా బోధపడుటలేదు. అంతయుఁ జిత్రముగానే యున్నది.

ప్రవేశము అత్తగారు.

అత్త——అబ్బాయీ! విశ్వేశం! ఏఁజేస్తున్నావురా!

విశ్వే——రా అమ్మా యిలాగ.

అత్త—నాకు రాత్రి చిత్రమైన కలవచ్చినది. పీతాంబరధారి—కౌస్తుభమణి వక్షస్థలమున గలవాఁడు—చేతపిల్లనగ్రోవి—ప్రక్కనే యాలమందలు కనబడినవి. ఆనీలాంబు వాహసన్నిభశరీరుఁడంతలో మురళీవాద్యము నారంభించినాఁడు. వెనువెంటనే మన సక్కుబాయి యంతంతబాలికలు—గోపికలు కాఁబోలును వచ్చి చుట్టును నిలుచఁబడిరి. ఆభువన మోహనమైన వేణుగానము నాకర్ణించి, వారెల్లరు పారవశ్యముచెందిరి. విశ్వేశా! ఆ బాలకృష్ణుని చేతిలోని మురళివంటిది బజారులో దొరకునేమో, యొకటి కొనుము. అమ్మాయీ! సక్కూ! రాత్రి నుండియు నామనస్సులో నేదో యొకవిధమగు వికారముదయించినది. అది యిట్టిదని చెప్పుటకు వలనుగాకున్నది. మనస్సంతయు మారిపోయి, యేదో క్రొత్తప్రపంచమున బ్రవేశించినట్లయినది. నీవనుదినము కృష్ణుఁడని, పాండురంగఁడని కలువరించుచుందువు. భజనచేయుచుందువు. 'కృష్ణా! ర' మ్మని 'పాండురంగా! రక్షింపు' మని పాటలఁ బాడుచుందువు. ఒక్కపర్యాయమైన సరిగా నాపాటలు నింతవఱకు వినలేదు. ఏదైన పాడుము తల్లీ!

విశ్వే—అమ్మా! మనం ఆవేళ దీన్ని పండరీపురమునుంచి తీసుకువచ్చి, కట్టేశామే జ్ఞాపకముందా అమ్మా! అప్పుడెలా పాడిందనుకొన్నావు. నేను ఇది పుడేస్తున్నదో చూద్దామని ప్రక్కనే నిలుచున్నాను. ఎంతబాగా పాడిందే. దీనిగొంతుక ఎట్లాఉంటుందనుకొన్నావు. కోకిల కంఠంలాగున ఎంత మధురంగా ఉంటుందనుకొన్నావు.

అత్త—ఆహాఁ! అలాగా! నేను వినలేదురా! పాడుతల్లీ!

మాయసక్కు—ఆపాండురఁగని మహాత్మ్యమిట్టిదని వర్ణించుట కెవ్వరితరమగును?

సీ. కష్టజీమూతాంధకారైక పటలికి
ప్రాభంజనగతి శ్రీరంగభజన
సంసారవారాశి జనితోర్మి పాళికి
సేతుచాప శ్రీరంగ చరణభజన
జీవితాశా తామసీలోకమునకు జ్వ
లల్దీప్తి కందకీరంగభజన
పాపాటవీతరు పటలికి నగ్నిసం
రంభంబు విఠ్ఠలరంగభజన
గీ. సుకృత దుష్కృత నిర్మల వికృతపావ
నత్వ పతితాపవిత్ర కాంతులనుమార్చు
పరమసౌభాగ్య కేవల దురితహరణ
నిర్మలౌషధి పండరీ నిలయభజన.

అత్త—అవునురా! కిన్నెరలు పాడేరా అనిపిస్తున్నది. మరొకటి పాడమ్మా,

మాయసక్కు—గీ. క్షీరవార్నిధివీచికాశేషశాయి
సుప్రకాశైక దివ్యముక్తిప్రదాయి
రమ్యపండరీవాసి శ్రీరంగశాయి
తలంచినకొలంది మదికి సంధిలును హాయి.

అత్త—సక్కూ! అయితే యీపాండురంగని ధ్యానించడానికి మార్గమేమైనా ఉందా?

మాయసక్కు—లేకేమి? పాండురంగనిగూర్చి మనసార ధ్యానించవచ్చును. ఆదివ్యనామ సంస్మరణమున మనమొనర్చిన పాతకములు నాశనమగును. మోక్షములభించును. ఆతనికొఱకు మనమెచ్చటికో పోనక్కరలేదు. ఆపరమాత్ముడు—ఆదయా

సముమునీడు అర్త్ర త్రాణపరాయణుఁడు—మనలో నేయున్నాఁడు
కేవలము మన హృదయ చాపల్యము నణఁచుకొనుటకే యీ
ప్రతిమలను విగ్రహములను నారాధించుట.

(తెరలో సక్కుబాయీ అను కేక)

అత్త—ఎవరమ్మా అది?

సక్కు—నా స్నేహితురాలు. ఇప్పుడే వచ్చెదను. (అని వెళ్లును.)
(తిరిగి వచ్చి) అత్తగారూ! పాండురంగవిఠలేశ్వరుని యుత్సవ
ము లిపుడు పండరీపురమున మహావైభవముగ జరుగుచున్న
వట. మనమటకుఁబోయివత్తమా?

అత్త—ఏమిరా! విశ్వేశా! దానికి చిరకాలమునుండి పాండురంగని
చూడాలనేకోరిక పీడిస్తున్నట్లుంది. వెడదామా?

విశ్వే—అమ్మా! నీనోటినుండి, అటువంటి అమృతమధురమైన వాక్కు
వెలువడినప్పుడు వద్దనడమే. అవశ్యము వెడదాం పద.

మాయాసక్కు—నాయభీష్టము సిద్ధించినది.

[తెరపడును.]



# సంగీత గులోబకావళి.

గ్రంథకర్త:—అయినాపురపు సుందరరామయ్యగారు.

నవరసములొల్కు ముద్దులమూటగట్టు నాటకరాజము. చక్క
ని పార్సీకర్ణాటకమట్లతో రచియింపబడినది. ఈనాటకమంతయు శృం
గారమే. ఎచట చదివిచూచిన ఆనందమే. పుస్తకము చదువుట మొ
దలుపెట్టినచో పూర్తిమగువరకు విడువజాలరు. వెల 1-0-0



శుభమస్తు.

# సతీసక్కుబాయి.

## షష్ఠాంకము.

### ప్రథమరంగము.

(ప్రవేశము కృష్ణుఁడు.)

అనుబంధము 12

కృష్ణుడు—(తనలో) ఆహా! తుదకెట్టి యిక్కట్టు సంభవించినది. నాకు యీసమస్యా పరిష్కారము మిక్కిలి కష్టముగఁ దోఁచుచున్నది. మాయాసక్కుబాయినై వీరిలో నెంతకాలము మసలితిని? ఆయుఃపరిమాణము ముగిసి, యసువులఁ గోల్పోయిన సక్కుబాయి కాయమున బ్రవేశించి, రుక్మిణి, నేనాడించుచున్న నాటకమునఁ బ్రధానపాత్ర ధరించినది. పాపమా కోమలి నన్నువీడి యొకక్షణమైన నుండఁజాలదు. రుక్మిణికొఱ కామె నెట్లైన బ్రతికింపవలయును. లేదేని అమాయికుఁడగు విశ్వేశ్వరభట్టు దుఃఖాతిశయమున గుండెపగిలి చనిపోవును. నేనిపుడేగి రుక్మిణి నీవలకు రావించెదను. సక్కుబాయిని బ్రతికించి, భక్తులందఱికిఁ బ్రత్యక్షమై, ముక్తినిచ్చెదను. నాలీలలను జూడ నాకే విస్మయము జనించుచున్నది. నేను మాయమైతి

సని విశ్వేశ్వర భట్టరును అత్తగారును మిక్కిలి పరితపించు చుందురు. అయినను భయములేదు. పండరీపురము సమీపించి నాము. పండరికిఁ బోయిన వెంటనే యచటిభక్తులు సక్కుబాయి మరణించినదని చెప్పుదురు. అప్పుడే రుక్మిణి, సక్కుబాయి దేహమున బ్రవేశించి నాటకమున పాత్రధారణ మొనరించును. ఈవిశేషము విశ్వేశ్వరభట్టును, అతని జననిని, యద్భుతానందసాగర నిర్మగ్నులఁజేయును. వారీలను జూచుకొలఁది నాకే నవ్వువచ్చుచున్నది.

చ. సతినయి భర్తతోఁ గలిసి సాగితి పత్నివిధాన ప్రేమతో
పతికడనుంటి తుట్టతుద పాల్పడినాఁడను చిక్కులందు న
ద్భుతములుపోలె నావనులుతోచును నాకె యదేమొకాని వ
ర్ణితములు కావటంచు వివరింతురు భక్తులు నిశ్చయమ్ముగా.

---

## ద్వితీయరంగము.

---

విశ్వేశ్వరభట్టరు—అత్తగారు పండరీపురప్రాంతమున బ్రవేశము.

విశ్వ—(నిదురనుండి మేల్కొని) అమ్మా! అమ్మా! అమ్మా!

అత్త—అబ్బా! ఎందుకురా కాస్సేపునిద్రపో నేను లేవలేను. ఇంకా బాగా తెల్లవారందే.

విశ్వే—అదేమిటే తెల్లవారలేదంటావు? సూర్యోదయమై గంటయింది. అదికాదే. నీకోడలెక్కడికో వెళ్ళిందే కనబడటంలేదే.

అత్త—అదేమిటారా నాయనా! అయ్యో సక్కుబాయమ్మ తల్లీ! మాయమైపోయావుటే దారితప్పి యెక్కడికైనా వెళ్ళిపోయిందేమోరా,

విశ్వే—దారితప్పడమేమిటే. మనదగ్గర యిక్కడనే పడుకుంది కాదుటే ఇంతలోనే యేమి అపాయము వచ్చిందో ఇంక అది కనబడదే మోనే. (ఏడ్చును.)

అత్త—అయ్యో!ఏడవకురా! వెఱ్ఱినాయనా! ఏం కర్మంవచ్చిందిరా కొంపకీ. అయ్యబాబూ!

విశ్వే—ఇప్పుడేం చేద్దామే?

అత్త—పండరీపురము సమీపి చాంగా. నడు ఊళ్లోకవెళ్ళి కనుక్కుందాం. కనబడకపోతే పట్టణంలో పోలీసువారితో చెప్పి వెతికిద్దాం.

విశ్వే—అయితే నడు.

[ప్రివేశము సుందరమ్మ, మాణిక్యాం, సరసమ్మ.]

సుంద—ఏమండోయి బామ్మగారూ! పాపం తెలిసిందా యేమిటి?

అత్త—ఏమమ్మా! ఏమిటది? మాసక్కుబాయమ్మ కనబడిందా?

మాణిక్యం—అదేమిటండీ! సక్కుబాయి కలబడ్డం యేమిటి? మీాకింకా తెలవదూ?

అత్త—ఏమిటమ్మా!

సర—అదికాదు. సక్కుబాయిూ మీారు కలిసిరా లేదూ?

అత్త—కలిసేవచ్చామమ్మా. ఇప్పుడే కలిసివచ్చాం ఊరివెలపల సత్రిములో రాత్రి పడుకున్నాము. తెల్లవారేసరికి మాయమైపోయింది. ఇదేం కర్మమోగాని అయితే మీాకు కనబడలేదూ?

సుంద—బాయమ్మగారూ! మీామాటలు చాలా అసందర్భముగా ఉన్నవి. మేమిక్కడికివచ్చి పదిరోజులయింది. సక్కుబాయి యిక్కడికివచ్చి పదిహేను రోజులయిందిట. ఆరోజునుంచీ ఏమి

భజనలు!— ఏమిపూజలు!— ఏమిసమారాధనలు!— చెప్పడానికి అలవిగాదమ్మా! ఇవాళ ఉదయాన్నే పాండురంగని కైంకర్యం చేసి, భక్తులతోఁ గలిసిపాడుచు, పాండురంగనిలో ఐక్యమై పోయింది. మఱి మీమాటలుచూస్తే చాలా చిత్రంగా ఉన్నవి.

అత్త—అయ్యో! విశ్వేశా! ఇదేమిటిరా! వీళ్ళిలాఅంటున్నారేమిటి?

విశ్వే—ఇంతవఱకూ మనదగ్గఱుండడమేమిటి? పదిహేను దినాలకి తమే యిక్కడికి వచ్చిందని వీళ్ళుచెప్పడమేమిటి? వాళ్ళకే పిచ్చియెత్తిందో, మనమే మాయలోపడ్డామో, నాకేమీ తెలవడంలేదు. అంతాగోలగా ఉందిబాబూ!

అత్త—అయ్యయ్యో! సక్కుబాయమ్మతల్లీ! మమ్మల్ని అగాధములో ముంచి పోయావే. నీకొత్తకోకలన్నీ ఏంచెయ్యనే?

విశ్వే—ఛీఛీ ఈరాగాలేమిటి? ఈయేడుపులేమిటి? వీళ్ళమాటలకీ, నీయేడుపుకీ అర్థంలేదు. నాకేమీ పాలుపోవటంలేదు.

అత్త—అయితే ఏంచేద్దామరా మరీ?

విశ్వే—అబ్బ! నీకెందుకేగోల? నడు, ఆలయంలోకిపోయి దరియాప్తు చేస్తే అన్నీ తెలుస్తవి. రాపోదాం.

తెఱపడును.

# తృతీయరంగము.

---

పాండురంగని ఆలయము.

ప్రవేశము శివనాథయోగి, భక్తులు, సక్కుబాయి.

నమామిరంగ విఠలే! ననమోహనాంగ విఠలే
ఆనందమూర్తి విఠలే! శ్రీనందబాల విఠలే ॥న॥
సర్వలోకచరంగ విఠలే! నాపాలిరంగ విఠలే
గోపాలబాల విఠలే! గోపీవినోద విఠలే ॥గో॥

(ప్రవేశము:—విశ్వేశము, అత్తగారు, సుందరమ్మ, నరసమ్మ, మాణిక్యము.)

అత్త—(సక్కుబాయిని కౌగిలించుకొని) నాతల్లీ! బ్రతికియున్నావా!

విశ్వే—ఏమమ్మా సుందరమ్మగారు! మీకన్నియేళ్ళువచ్చాయి. ఇంకా అబద్ధాలేనమ్మా!

సుంద—నామాట నమ్మండి. ఏమో! మాణిక్యం చెప్పండరా! ఆఖరికి పిడుగు నామీద పడింది. అడగండి వీళ్ళని.

విశ్వే—ఏమండీ! ఇది యిక్కడికివచ్చి ఎన్నాళ్ళయింది?

అత్త—చెప్పండి నాయనా! మాసక్కుబాయమ్మవచ్చి యెన్నిరోజు లయిందిబాబూ?

భక్తులు—పదిహేనుదినములయినదమ్మా. నేటిఉదయమున పాండురంగభక్తి పరవశమై సక్కుబాయి, యసువుల గోల్పోయినది. తుదకు పాండురంగని యపారకృపావిశేషమున బ్రతికినది.

అత్త—ఈపదిహేనురోజులూ మావద్ద కోడలువలె మెలగినదెవరు?

విశ్వే—నిజమేనే? నన్ను 'ప్రాణేశ్వరా! ఏమండోయి' అని ఎంతో చక్కగా పిలిచేది. నిన్ను అత్తగారూ అనేది. అదెవరే. ఇక్కడున్నదెవరే.

సక్కు—(నమస్కరించి) అత్తగారూ! నిజముగా నేనిచటికివచ్చి పదునైదు దినములైనది. మీకుమారుఁడే నన్నిచటకుఁబంపినారు.

విశ్వే—ఇదో అసత్యమూ? నేను నిన్ను పంపించానా?

సక్కు—అవును. మీరుకాదా?

అత్త—ఇది చాలా చిత్రముగానే ఉంది.

శివ—అమ్మా! చిత్రమేమియు లేదు. నీవదృష్టవంతురాలవు. ఆపరమాత్మునకు—పాండురంగవిఠలేశ్వరుఁడు మిమ్మనుగ్రహించినాఁడు. పాండురంగఁడే మిమ్ములను సక్కుబాయియై సేవించినాడు మీజన్మములు పవిత్రములైనవి. సురలు సేవించుటకుకూడ నవకాశముదొరకని పరమేశ్వరుఁడు మీ కూడిగముచేసినాఁడు. అట్టి మిమ్ముల సందర్శించి మేమును పావనులమైతిమి. పాండురంగని ధ్యానింతమురండు.

కృ—(ప్రత్యక్షమై) భక్తాగ్రగణ్యయగు సక్కుబాయి కీర్తిచంద్రికలు దిగంతవిశ్రాంతములగునుగాక. ఆమెను సందర్శించి, ఆమెతోడు నన్ను సేవించినమీకుఁగూడ మోక్షములభించునుగాక!

(అందరు నమస్కరింతురు. కృష్ణుడు మాయమగును.)

శివ—ఇఁక కావలసినదేమి? పాండురంగనికి మంగళహారతి యిత్తము.

సక్కు—అత్తగారూ! నాతప్పులను మన్నించుడు. నాథా! నాదోషములను క్షమించుడు.

అత్త—అమ్మో! నామొహంమండినక్లేశమున్నది. నిన్నెంతో బాధించాను. తిట్టాను. కొట్టాను. అన్నిటినీ ఓర్చుకొన్నావు. నా తప్పు యిప్పటికి గ్రహించాను. అమ్మాయీ! చిన్నదానవైనా సరే. నన్ను నువ్వే క్షమించాలి. (నమస్కరించును.)

సక్కు—తప్పు తప్పు. మీనమస్కారములు నాకువలదు. పెద్దలు చిన్నలను మన్నింతురా? రండు; ఆపాండురంగని స్మరింతము.

విశ్వే—అదియటుంచి ముందీశివనాథయోగిపుంగవుని పాదములపై బడుదము. ఆమహాత్ముని వివిధముల దూషించినాము.

అందఱు—(శివనాథయోగికి నమస్కరింతురు.)

శివ—మీనమస్కారములు శ్రీపాండురంగవిఠలదేవునకుసమర్పింపుడు.

శ్లో. భగవద్గీతా కించిదధీతా గంగాజలలవకణికాపీతా
సకృదపియేనమురారిసమర్చాతస్యకరోతియమోపినచర్చాం.

మంగళము ఓంతత్సత్.

సమాప్తము.

